# శ్రీ వినోబా ప్రవచనములు



లేఖకులు:

నిర్విషయానంద బ్రహ్మచారి



ప్రేమవాణి ప్రచురణ

నెల్లూరు

వెల 0—6—0

ప్రథమ ముద్రణ :
1—5—1956.

ప్రతులకు :
ఎ. సుబ్రహ్మణ్యాం
పేరిమవాణి ప్రచురణశాఖ,
రంగనాయకులపేట - నెల్లూరు.

ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్యసహాయ దాతలు
శ్రీ అప్పల ఆంజనేయులుగారు.

నవయుగం పవర్ ప్రెస్, నెల్లూరు.



అడిగినంత నె నేలాటి యడ్డుమాట
పలుక కీ దివ్య కార్యంబు సలిపినావు
ఆర్త పరిపోష! అప్పల ఆంజనేయ!
సతము ధర్మము మిము రక్షసలుపుగాత!

2246

# మనవి

పరమ పూజనీయులైన శ్రీవినోబాజీ ప్రవచనములను మధురమైనభాషలో సర్వజనవిదితముగా వ్రాసి ప్రకటించు భాగ్యమును మాకుకలిగించిన శ్రీనిర్విషయానంద బ్రహ్మచారి గారికి మానమస్కృతులు.

ఈ పుస్తకములో భూదాన, సంపత్తిదాన, బుద్ధిదాన శ్రమదాన, విషయములును, ఆధ్యాత్మిక విషయములును, నైతిక విషయములును గలవు. మన నిత్యకర్మలు ఫలప్రద ములుకావలయుననిన దైవానుగ్రహమవసరము. భగవత్కృ పను బొందవలయుననిన శ్రీవినోబాజి ఈపొత్తములో చెప్పి నట్లు కష్టజీవులకు చేతనైన సహాయమును (దానమును) చేయవలయును. కావున సర్వజనులు శ్రీవినోబాజి ప్రీయ వాక్కుల గ్రహించి శక్తిననుసరించి యేదానమైనను జేసి ధన్యులుకావలయునని కోరుచున్నాము.

ఇట్లు, తమ,

అప్పల ఆంజనేయులు,
వేంకటలక్ష్మిదేవి.

# ★ పూజా పుష్పము ★

పూజ్య శ్రీ విశ్వగురు వినోబాగారి విజ్ఞానజ్యోతులను, స్వామి గర్భాలయములో ప్రమిదజ్యోతులను తీర్చి దిద్దిపెట్టి నట్లుగా పూజ్య శ్రీ నిర్విషయానంద స్వామిగారు సంపుటీ కరించియుండ, ఇక వానినిగూర్చి పలుకుమాటలెవ్వి! కాని విశ్వగురు వినోబా శ్రీ నిర్విషయానందస్వామిగార్ల మీద నున్న భక్తి పరిపూర్ణభావముచే నీలేఖకుల కోరికపై చందురినికోరి నూలుపోగువలె రెండుమాటలునావి. కాక పోయినచో కొండంతస్వామికి కొండంత పత్రినేవిధముగా చేకూర్చగలుగుదుము!

కురుక్షేత్ర మహాయుద్ధములో శ్రీకృష్ణభగవానుడు స్వధర్మ కర్తవ్యమూఢుడై యున్న యర్జునుని కర్తవ్యోన్ముఖుని చేయుటకు హితోపదేశమును జేసెను. అది నాటికి నేటికి సర్వకాల ప్రామాణికముగా నిలిచి పోయినది. అదేవిధముగా నేడు కర్తవ్య దూరులైన ధనవంతులకు తదితరులకు విశ్వగురు వినోబా అందజేయుసందేశము, సర్వకాల సత్యముగా రాణించుననుటలో సందేహములేదు నాటి భారత మహాసంగ్రామఫలితముగా భగవద్గీత లభ్యమైనది. నేటి ఆర్థికాసమాన తీవ్రసంక్షోభ ఫలితముగా విశ్వగురు వినోబా సందేశము వినిపించినది. విశ్వగురు సందేశము విశ్వమునకు నూతన ప్రభాతము.

కర్నూలు ప్రాంతములో విశ్వగురు వినోబాగారి చెంత నిర్విషయానంద స్వామిగారుండుట సంభవించినది. వారి యుపన్యాసములను మాటవదలక మధురమైన జాన తెలుగులో వ్రాసి తెలుగు సోదరులకు ఈ యమూల్య గ్రంథమునందించుచున్న శ్రీ నిర్విషయానందస్వాములు అభివందనీయులు. నాకీ ప్రజాపకాశమిచ్చినందులకు నేను వీరికి యెంతేని కృతజ్ఞుడను.

ఓమ్

నెల్లూరు,
15-4-1956

ఇట్లు యుష్మదీయ,
ఆకుల సుబ్రహ్మణ్యాం.

# నా అభిప్రాయం

శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారిగారు సేకరించిన విశ్వగురు వినోబా ఉపన్యాసములు జ్ఞానోపదేశములుగా విరాజిల్లుచున్నవి. సాదరముతో ఆంధ్రజనులు ఈ పుస్తకమును ఆదరించెదరని నేనాశించుచున్నాను.

వినోబా ప్రవచనములను జదువుట యననొక ఉత్తమ గ్రంథమును జదువుటయని నా అభిప్రాయము. ఉత్తమ గ్రంథపఠనాభిమానులెల్లరూ ఈ గ్రంథమును గౌరవించి పఠించగోరెదను.

ఇంకనూ శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారిగారిట్టి లోకోత్తమ కార్యముల జేసి ఆంధ్రజనులకుపకారము జేయుదురని నా తలంపు.

ఇట్లు తేము

దేవతా చెంచురామయ్య,
బి.ఎ., బి.యల్.,

నెల్లూరు

1—5—1966.

# లేఖకుని పలుకులు

శ్రీ వినోబాగారితో నుండు భాగ్యము కలిగినది. ఆయన సందేశములు విశ్వకళ్యాణదాయకములు. అట్టి దివ్యవాక్యములను విని విడుచుటతో సంతృప్తి కలుగలేదు. మొదట యెప్పుడైన జ్ఞాపకము చేసుకొనుట కనుకూలముండును అను యుద్దేశ్యముతో వారి పవిత్రోపన్యాసములను సాధ్యమైనంతవఱకు వ్రాసికొనుచువచ్చితిని. నేను వ్రాసుకొనిన వాక్యములు నాకేపరమానందమును గూర్చుచుండినవి. మిత్రులకు వినిపించగా వారును పరమానంద సంభరితులై పుస్తకముగా నచ్చువేయించిన బాగుండునని సలహాలనిచ్చిరి.

ఆపిమ్మట ఈపవిత్ర కార్యాచరణ విషయమును శ్రీ అప్పల ఆంజనేయులుగారితో ప్రస్తావింప పరమానందముతో వారే ఈముద్రణా ఖర్చుభారమును వహించుటకు సంసిద్ధులై యంగీకారమును జూపినారు. వెంటనే అచ్చువేయించి తన సహజధర్మగుణమును వెల్లడించినారు. వారి యాదర్శములకు యనుగుణ్యమైన అర్ధాంగి వేంకటలక్ష్మీదేవిగారు పతిధర్మగుణమునకు దోహదమొసగుచు భారతనారీమ తల్లుల ఋజువుచేసికొనినది. సర్వశక్తిసంపన్నుడైన సర్వేశ్వరుడు సద్ధర్మయుత సకలైశ్వర్యముల నొసగూర్చి దేశకాల పాత్రోచిత ధర్మముల వారిచే చేయించుగాక!

"ప్రేమవాణి" సంపాదకీయ భారమునువహించి ఈ గ్రంథమునకు అమూల్య భావగరిమతో పరిచయ వాక్యముల వ్రాసి ప్రేమ సందేశమును లోకములో చాటుటకు దోహద పడుచున్న శ్రీ ఆకుల సుబ్రహ్మణ్యంగారు సదాప్రీతిపాత్రులు. ఇంకను ఈకార్యమునకు దోహదపడిన మిత్రలోకము మఱువ రానిది. సర్వేశ్వరుడు లోకములో శాంతియు, సద్భక్తియు విజ్ఞానమును వెలయించుగాక!

నెల్లూరు
1—5—1956

ఇట్లు విశ్వశుభాభిలాషి,
**నిర్విషయానంద.**



# ★ శ్రీ విశ్వగురు వినోబా ★

రచన:

## నిర్విషయానంద బ్రహ్మచారి



సీ॥ శ్రీరమణీయ మహారాష్ట్ర సీమను
జనన మొందిన దివ్యజన్ము డెవడు!
భయశోక సంశయ బాధానివర్తిత
సుస్థిత సుజ్ఞాన సుభగు డెవడు!
ఆజన్మమాధ్యాత్మికానంద వైభవ
కాంతుల బఱపు వేదాంతి యెవడు!
విశ్వరహస్య సువీక్షిత సంవ్యాప్త
యోచనాయుత పూర్ణయోగి యెవడు! 1

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభముకై బోధ సలుపుచుండె
నా మహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రమంబున వర్తించి ధన్యులగుడు.

సీ॥ సర్వజీవుల శాంతి సౌఖ్యంబులనుగోరి
సతతంబు సత్క్రియల్ సలుపునెవడు!
సర్వశాస్త్రంబుల జదివి సారముదీసి
సరసవాక్తతి బోధ సలుపునెవడు!
నిత్య నిరుపమ శుద్ధ నిర్గుణ సత్యముఁ
నమకీ కన్గొని యందెనిలచె నెవడు!
భారతావనిగల భాషలన్నిటి ప్రీతి
నేర్చిన పాండిత్య నేత యెవడు! 2

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నామహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రమంబున వర్తించి ధన్యులగుడు.

సీ॥ సకల మానవుల సంస్కరణ చేయగనెంచి
నిర్మాణ కార్యంబు నెఱపునెవడు!
సకల భేదంబుల సమయింపజేయగా
సామ్యయోగము జాటు సదయుడెవడు!
సకల దారిద్రముల్ సంహరింపగబూని
భూదాన మడిగెడి పుణ్యుడెవడు!
సకల దుర్వ్యసనముల్ జగతి బోద్రోలగ
భవ్యనీతుల నేర్పు ప్రాజ్ఞుడెవడు! 3

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నామహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రియంబున వర్తించి ధన్యులగుడు.

సీ॥ గీతా ప్రవచనముల్ చేతో ముదంబుగా
బోధజేసిన మహా పూజ్యుడెవడు!
సత్యధర్మంబులు సత్ప్రేమతో సదా
వివరించి తెలిపెడి విమలు డెవడు!
నియమ జాలంబులు నేర్పులో గఱపెడి
కుశలసంయుత భావ గురుడెవండు!
పరమ సత్యంబును బయటబెట్టుటయందు
ధీరత్వమును జూపు దిట్టయెవడు! 4

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నామహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రియంబున వర్తించి ధన్యులగుడు.

సీ॥ గ్రామరాజ్యము దేర కాల్నడకన్ బూని
పర్యటించెడి లోక బంధువెవడు
వ్యక్తి సత్యాగ్రహ ప్రథము వీరుండని
గాంధి తెల్పిన శౌర్య ఘనుడెవండు
ప్రేమ సుధావృష్టి విద్వేషవహ్నుల
చల్లార్చుచున్న ప్రశాంతుడెవడు

మోహజాలంబుల మొదలంట మసిమిన
దివ్యవైరాగ్య సందీప్తుడెవడు! 5

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నామహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రియంబున వర్తించి ధన్యులగుదు.

సీ॥ ఆర్త సంసేవచే నానంద మొందెడి
ముగ్ధమోహన సుధామూర్తియెవడు!
సహజ ప్రకృతి చిత్ర సౌందర్యదర్శన
లాలసరసిక సల్లలితుడెవడు!
చిన్న ఛలోక్తుల చిఱునవ్వు మొలకెత్త
శ్రోతృలోకము దేల్చు సూరియెవడు!
గాంభీర్యభావాలు కడుచిన్న మాటల
వ్యక్తపఱచు వశ్యవక్త యెవడు! 6

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నామహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రియంబున వర్తించి ధన్యులగుదు.

సీ॥ సుందర నవభావ శోభితోపన్యాస
కల్పనాద్భుత దివ్య కవియెవండు!
బంగారు రంగారు ప్రాతస్సమయనభో
దర్శన హర్షవిస్తారుడెవడు!

దేహ విస్మృతినొంది దివ్యభావాంబుధి
మునిగి తేలెడి నిత్య ము_క్తుడెవడు!
జంతు కోటికనురాని చనవుతో భూముల
నడుగజాలిన యభేదాత్ముడెవడు! 7

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నా మహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రియుంబున వ_ర్తించి ధన్యులగుడు.

సీ॥ గాంధీమహాత్ముని కారుణ్య దృష్టిని
ధారణ జేసిన ధన్యుడెవడు!
అడుగుబెట్టినచోట నార్ష తేజమునింపి
దురిత ముడుపు శాంతిదూత యెవడు!
ఆడంబరంబుల నన్నిటి ఖండించి
కష్టజీవుల సేవ గఱపు నెవడు
విశ్వకుటుంబమ్ము వెలయింప గంభీర
దృఢ దీక్షబూనిన దివ్యుడెవడు! 8

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నా మహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రియుంబున వ_ర్తించి ధన్యులగుడు.

సీ॥ విశ్వతోముఖ భావవితతితో స్వార్థుల
　　వెలుపించు విజ్ఞాన విభవుడెవడు
అరికి సమతకై యనవరతంబును
　　బని జేయు నిస్వార్థ వరుడెవండు
చలన మెఱుగని యచల గంభీర గరిమచే
　　వరలెడి నైష్ఠిక వటువెవండు
కాయకష్టము జేసి కడుపు నింపగ లేని
　　పేదవారికి కల్పవృక్షమెవడు ! 9

తే॥ అట్టి విశ్వగురు వినోబ యఖిలజనుల
శాంతి శుభములకై బోధ సలుపుచుండె
నా మహాత్ముని సద్వాక్కు లాలకించి
తత్క్రమంబున వర్తించి ధన్యులగుడు.

1

# శ్రీ వినోబా ప్రవచనములు

## కర్నూలు జిల్లా

## పెద్దపాడు గ్రామం 13-3-1956

అందరు చక్కగా కూర్చుండవలయును. ఇప్పుడు రాయలసీమలో యాత్ర ప్రారంభమైనది కర్నూలులో నిన్నటి దినమున్నాము. ముఖ్యముగా మాకు పల్లెలకు పోవుటయనిన పరమసంతోషము. పట్నములలోకూడ మంచి విషయములను జెప్పుచున్నాము. మేము పల్లెలను పట్టణములను భేదము లేకుండ యందరి మేలును గోరుచున్నాము. పల్లెపల్లెకు భారతదేశహృదమును, ప్రకటించుచున్నాము. మేము యిచ్చట శాంతినిగూర్చి చెప్పినాము. ఈ మధ్య నొకరు శాంతిని స్థాపించుటకు కత్తిను బట్టుకొని యందరిని బెదరించుచున్నారు. ఎవరి చేతనైన తుపాకి యుండినచో కత్తియున్నవారికి శాంతిని బోధించుటకు తుపాకిని చూపించు చున్నారు. బాంబులున్నవారు తుపాకులున్నవారికి శాంతిని బోధించుటకు బాంబులను చూపించుచున్నారు. చేతిలో కత్తిబుచ్చుకొనినవారు, ప్రజల హృదయములో శాంతిప్రేమ లను నెలకొల్పుటకు ప్రయత్నించవలయును. అయితే పీపత్తో పాటు గ్రామములకుపోయి మంచి విషయములు చెప్పవల

యును. నేడు గ్రామములు మలినయుతముగానున్నవి. మల మూత్రముల నెచ్చటనంటే నచ్చట విడచుచున్నారు. పొల ములకుపోయి యచ్చట మలవిసర్జనము చేసి పూడ్చిపెట్టవల యును. అట్లు చేసినచో, ఈగలు వాలవు. ఆ మలము యెరువుకాగలదు. శుచివంతులుగను, ఆరోగ్యవంతులుగను గాగలరు. పైరులుబాగుగాపండును. మఱియు పల్లెలలో చుట్ట, బీడి, సిగరెట్టు, కల్లు, సారాయి, త్రాగుచున్నారు. అందు వలన యనారోగ్యవంతులగుచున్నారు. పండ్లు, కూరలు, ధాన్యము, పండెడి భూములను, పొగాకుకొఱకు వ్యర్థపఱచు చున్నారు. ఈ వ్యసనములు మాన్పించుటకు గ్రామగ్రామ మునకుపోయి వారికి నచ్చజెప్పి చెడ్డయలవాటులను మాన్పించవలయును. మఱియు కలహములు పెట్టుకొను చున్నారు. ఈ కలహములచే కోర్టులకు పోవుట దానిచే ద్రవ్యమును పోగొట్టుకొనుట జరుగుచున్నది అందరికి ప్రేమ దృష్టిని కలిగించుటకు నిరంతరము కొందరు తిరుగుచు విజ్ఞాన విషయముల గఱపవలయును.

ఈ దుర్గుణములు చిన్నవిగా నుండవచ్చును. కాని, వీనివలన పెద్ద యనర్థములు కలుగుచున్నవి. కొలదిమంది చేతులలో భూమియుండుటచేత, తక్కిన వారికి భూములు లేక పోవుటచేత, కలహములు వచ్చుచున్నవి. మఱియొక దుర్గు ణము గ్రామములలో నున్నది. బద్ధకము (సోమరితనము) మన మీ దుర్గుణమును నశింపజేయవలయును. అందరు గ్రామములో కలసిమెలసి యుండునట్లు చేయవలయును,

మన బట్టలను మనమే తయారు చేసికొనవలయును. అందు కొరకు ప్రత్తి వేయవలయును. మన యందరికి భూమియుండి వ్యవసాయము చేయుటయే చాలదు. వర్షము కురియ నప్పుడు మనకేపనియు నుండదు. కనుక చేతిపనులను నేర్చు కొనవలయును. కేవలము పొలముమీద యాధారపడుటయే చాలదు. కొట్లాటలను మనము మానవలయును. కొట్లాటల వలన మనకున్నడబ్బు నష్టమగుచున్నది.

మనము దూరముగా పొలములకుపోయి మలవిసర్జ నము చేసి మలముమీద మట్టివేసిన యెరువుకాగలదు. త్రాగుడు వదలవలయును. నిత్యము హరికథలు చెప్పుకొను చుండవలయును. ఈ చెవులు జ్ఞానవిషయమును వినుటకు భగవంతుడు యిచ్చియున్నాడు. చదువుకొనినవారు సర్వు లకు రాత్రి సమయమున చదువు నేర్పవలయును. ఇట్టి నడు వడితో గ్రామమునంతయు నొక కుటుంబముగా నెంచుకొన వలయును. మేము గ్రామవాసుల దగ్గఱకుపోయి వారికి నచ్చ జెప్పుటచేత తొమ్మిది వందల గ్రామములను దానముగా నిచ్చినారు. మేము భూమిని సమముగా పంచెదము. ఎవ్వరు భూమిలేనివారుండకూడదు. అందరు సౌఖ్యముగా నుండ వలయునని కోరుకొనుచుందుము. ఆంధ్రదేశములో కార్య కర్తల సంఖ్య చాల తక్కువగానున్నది. దీనికి కారణ మిచ్చటివారు విశాలాంధ్రకై పాకులాడుచుండుటయే! తెలం గాణలో యున్నవారు మనుష్యులే. అయినను వారు చాలా యుత్సాహముగా పనిచేయుచున్నారు. ఇచ్చట యనవసర

ముగా రాజకీయకలహములు పెట్టుకొనినారు. విశాలాంధ్ర వచ్చినది. తుంగభద్ర వచ్చినది. ఇంక రాజకీయసమస్యలు లేవు. అందరు కలసి పనిచేయవచ్చును. పంజాబులో నందరు కలసి యుండవలయునని నిశ్చయించుకొనినారు. అనవసరకలహములు పెంచుకొనుటచే మన శక్తులు నశించగలవు. బాబా కొట్లాటయనిన చాల విచారపడుచుండును. పంజాబు వారిప్పుడు రాజీ కుదుర్చుకొనినారు. కనుక వారి కిప్పుడు ధన్యవాదములు. పంజాబు తగవులుండినచో ప్రపంచమునకే యుద్ధము సంభవించగలదు. ఇక వారి వాక్కులనుండి హితవాక్యములే వెలువడుగాక! భూదానోద్యమములో సర్వులు యైకమత్యముగా నుండుటకు సావకాశమున్నది. కొలదికాలములో చెప్పదగినవిషయమును చెప్పినాము. మావద్ద కొన్ని పుస్తకములున్నవి. వానిని చదువుకొనినవారు తీసికొని చదివి చదువులేనివారికి వినిపించవలయును. అందరికి హృదయపూర్వక వందనములు ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

---

## (2)

కర్నూలు జిల్లా 14-3-1956

నాగులాపురం గ్రామం ఉదయం 7 గంటలకు

ఎవరును భూమిలేనివారుగానుండకూడదు. అట్లు ఈశ్వరునిచే నిర్ణయింపబడినది. నేను మిమ్ముల భూమి నడుగుచున్నాను. ఎట్లడుగుచున్నాను? ప్రేమతో నడుగు

చున్నాను. ప్రేమతో నడిగినచో నెవ్వరూ భూమినివ్వకుండ యుండజాలరు. ఆవును మనము పాలు పిండుకొనవలయునని నచో దాని కాళ్ళకు తాడుకట్టి పిండుకొనెదము. దాని దూడ పాలు త్రాగవలయుననిన తాడు కాళ్ళకు కట్టవలసినపనిలేదు. ఎందుచేత? ప్రేమతో పాలు త్రాగుచున్నది కనుక, ప్రేమతో పాలు నన్నిటిని ఆవు యిచ్చుచున్నది. మనము ఆవుపాలు బలవంతముగా పిండుకొనబోవుచున్నాము. అందువలన ఆవు మనకు సరిగా పాలనిచ్చుటలేదు. తాడు కాళ్ళకుకట్టి పిండు కొనబోయినపుడు సంపూర్ణముగా పాలనిచ్చుటలేదు. కొన్ని పాలను ఎగజేపుకొనుచున్నది. దూడకైనచో పాలనన్నిటిని యిచ్చుచున్నది. నే నెవరిని? ఆవుదూడను. ప్రేమతో భూమి నడుగుచున్నాను. అందుచే నందరు ప్రేమతో నిచ్చెదరు.

మీ రెల్లరు నూలువడుకుకొని బట్టలు నేసుకొనవల యును. అప్పుడు మీకు బట్టలకొఱతయుండదు. మీరు మంచి బట్టలు కట్టుకొనగలరు. అప్పుడు పట్టణవాసులు మిల్లుబట్టలు కట్టుకొనవలసి వచ్చును. ఆ బట్టలు చినిగిపోయినచో పట్టణ ములలో మిషను కుట్టువారున్నారు. కనుక వారికాపని కష్ట ముండదు మీ బట్టలు చినుగుటకు ముందుగానే, ఆ బట్టలను పరుపులు కుట్టుకొనుటకు వినియోగించెదరు. మంచి క్రొత్త బట్టలను కట్టుకొనగలరు, మీ కెందుకు మంచిబట్టలు దొరుకకు చున్నవనిన, మీ రే ప్రత్తి పండించుకొని వడుకుకొని నేసు కొనుచున్నారు కనుక, పట్టణవాసులు బట్టలకు నూలు వడకరు, నేయరు కనుక, వారికి మంచిబట్టలు దొరుకవు. మీరెల్లరు

ఐకమత్యముతో నన్ని పనులు చేసికొనినచో ఆహారపదార్థ
ములు, బట్టలు, లభ్యముకాగలవు; సౌఖ్యముగా జీవించ
గలరు. ఈ విషయమును మీరందరికి చెప్పుడు. మఱికొన్ని
విషయములు సాయంత్రము చెప్పెదము. అందరికి నమ
స్కారములు.

---

# (3)

## కర్నూలు జిల్లా

## నాగులపురం 14-3-1956

ఈదినము ఉదయ మీ గ్రామములో వారు మమ్ము
లను జూచుటకు వచ్చినారు. వచ్చినవారికి భూముల నందరికి
యివ్వమని చెప్పినాము. ఇప్పుడన్ని గ్రామములోనివారు
భూమిని సమముగా బంచుకొనవలసియున్నది. అందుచే
భూమి నివ్వవలసియున్నది. ఉదయము మేము చెప్పిన మాట
లను ప్రజలు వినియుంటిరి. కాని ఆ మాటలు వారికి కానట్లు
న్నది చెప్పినది. మేము భూమి నివ్వమని కోరుచున్నామనిన
అది ఈశ్వర యాజ్ఞయని చెప్పినాము. ఎవరియాజ్ఞ ?
అది ప్రేమయొక్కయాజ్ఞ. ఉదయము మే మొక యుపమానము
చెప్పినాము. అది ఆవుదూడకు సంబంధించినది ప్రేమతో
ఆవు, దూడకు పాలనిచ్చుచున్నది. ఎంత కాలమువఱకు దూడ
పాలు లేకుండ జీవించజాలదో అంతవఱకు ఆవు పాలను

యిచ్చును అట్లే యెంతవఱకు భూమిలేనివారుందురో, అంత వఱకు మేము ప్రచారము చేయుచునే యుండెదము. భూమి స్వల్పముగానున్నవారు యివ్వవలయును. భూమి యెక్కువగా నున్నవారు ఇవ్వవలయును. తరువాత ఎవరెంత వ్యవసాయము చేయగలుగుదురో యంతే యుంచుకొనుట జరుగును. అప్పుడు కూలీలు పనిచేసెదరు. నేటి భూమి యజమానులు పనిచేసెదరు.

ప్రభుత్వము ఈ విషయమై చేయవలసినపని యేమియు లేదు. మీరు పెండిండ్లు చేసికొనుచున్నారు. చనిపోవుచున్నారు. మఱియు శ్మశానమునకు గొనపోవుచున్నారు. ఈ పనులన్నియు ప్రభుత్వము చేయుటలేదు. పై కార్యములు ప్రజలు పరస్పరప్రేమతో చేసికొనుచున్నారు. ప్రజలు ప్రేమతో నీ భూమిని సమముగా పంచుకొనినచో ప్రభుత్వము చేయవలసినపని యేమున్నది? ఈ రోజు భగవంతుని యాజ్ఞయైనది. ఈరోజు సాయంత్రమొక సోదరుడు ఇరువది యకరముల భూమి నిచ్చినారు. ఆ భూమిని ప్రజలు ఇండ్లు కట్టుకొనుటకు ఇచ్చినారు. ఈ రోజుదయము జరిగిన యాజ్ఞ మీ చేతకూడ భూమి నిప్పించుచున్నది అసలు విషయమేమన భూమిపై నెవరికిని యాజమాన్య ముండకూడదు. మీమీద యెవరును యాజమాన్యము వహించకూడదు. ఈ మట్టిని పరమేశ్వరుడే సృష్టించినాడు. నీరునుకూడ పరమేశ్వరుడే సృష్టించినాడు. ఎవరును నీటిని యాజ్ఞయందుంచుటలేదు. పంచభూతములందరికి సమానములు.

ప్రేమవిషయమును ప్రతివారును అర్థము చేసికొనవల యును. బాబా ఈశ్వరుని పేరు నుచ్చరించుచుండగా కొందరు ఆ ఈశ్వరుడెటులుండునని యడుగుచున్నారు. ఈశ్వరుడనిన సత్యము, ప్రేమ, యని యర్థము. ఈ భూదానకార్యములో సత్యప్రేమలున్నవి. ఈ యమాయకులు భగవంతునకు నాలుగు చేతులుండునని తలంచుచున్నారు. ఈశ్వరునికి నాలుగు చేతులున్నవనిన యెదుట వానివి రెండు చేతులు తనవి రెండు చేతులని యర్థము. ఈశ్వరుడు మూడు తలలు కలిగియున్నాడందురు. అనగా ముగ్గురున్నచోట భగవంతు డున్నాడని యర్థము. ఈశ్వరునకు అయిదు తలలున్నవని యనెదరు. అనగా నైదుగురున్నచోట భగవంతుడున్నాడని యర్థము. తెనుగులో పదిమందిలో పరమాత్ముడున్నాడని యనెదరు. పదిమంది మంచివారున్నచోటుకు పదిమంది మంచి వారు చేరెదరు. పదిమంది చెడ్డవారున్నచోటుకు, పదిమంది మంచివారు చేరరు. పదిమంది దొంగతనము చేసినచో నంద రును అచ్చటికిరారు. పంచాయితీ ఈ న్యాయమునే యిచ్చు చున్నది. అంటే పదిమంది చేయుచున్నారు. కనుక యచ్చట భగవంతుడుండును. ఈశ్వరుడు సత్యస్వరూపుడు. అసత్యము చెప్పు స్థలమున ఈశ్వరుడుండడు. ప్రేమయున్నచోటుకు ఈశ్వ రుడు వచ్చును. తగవులున్నచోటుకు రాక్షసుడు వచ్చును. సత్యముండిన యచ్చటికి ఈశ్వరుడు వచ్చును. "ఇచ్చట స్త్రీలు యున్నారు" పురుషులు మోహములో పడిపోయి నచో భూములనెవ్వరివ్వగలరు? అప్పుడు స్త్రీలు తమ

భర్తల కిట్లు చెప్పవలయును "మనకు పిల్లలున్నారు." మన పిల్లలను భగవంతుడిచ్చినాడు. భూమిలేనివారికికూడ పిల్లలను భగవంతుడిచ్చినాడు. వారిని వారిపిల్లలను, పోషించుటకును, మనలను, మనపిల్లలను, పోషించుటకును, భగవంతుడు భూమి నిచ్చినాడు. భూమిలేనివారికి పిల్లలు లేకపోయినచో భూమిని మనమే యుంచుకొనవచ్చును. వారికి భగవంతుడు పిల్లల నిచ్చినాడు. కనుక మనము భూమిని వారికివ్వవలయును.' ఈ విధముగా పిల్లలుండి భూమిలేనివారికి భూమిని, తప్పక యివ్వవలసినదని స్త్రీలు తమ భర్తలకు నచ్చజెప్పవలయును. అప్పుడు పురుషులు తప్పక భూమి నిచ్చెదరు.

మాకు తెలిసిన యొక వకీలు కథ చెప్పెదము. ఆయన తన భార్యాసమేతముగా బాబా యుపన్యాసమును వినుటకు వచ్చినాడు. ఉపన్యాసము విని యింటికి పోయినాడు. ఆ వకీలునకు పది యకరముల భూమియున్నది. ఆ వకీలుగారికి భూదానము చేయవలయుననెడి బుద్ధిపుట్టలేదు. ఆయన యుద్దేశ్యమును భార్య గుర్తించినది. అప్పుడామె భర్తతో నిట్లు చెప్పుటకు మొదలిడెను. "ఏమండీ! భగవంతుని యనుగ్రహము వలన మీ వకీలుపని బాగుగా జరుగుచున్నది. మన పిల్లలకు మనకు యేలాటి కొఱతయు లేదు. మనకు పది యకరములు భూమియున్నది. ఎంతోమంది పేదలు పిల్లలుకలవారు భూమి లేక తిప్పలు పడుచున్నారు. మీరు సేద్యముచేయుటలేదు. పేదలు కష్టపడి పండించినది దోచుకొనుచున్నారు. ఇది యధర్మము. మీకుతగినపని కాదు." అని సవినయముగా నీతిని

బోధించినది. పాపము వకీలుగారికి యూపిరియాడలేదు. ఆమె యుద్దేశ్యము నామోదించినాడు. బాబా దగ్గఱకు భార్యా సమేతముగా వచ్చినాడు. పై వృత్తాంతమును బాబాకు చెప్పి దానపత్రమును వ్రాసినాడు. ఆ పత్రమును సభలో చదివే సమయమున ఆయన ఈవిధముగా చెప్పినాడు.''నా పేర భూమి యున్నది కాన నా పేరుతో బాబాకు భూమి నిచ్చుచున్నాను. నిజముగా నేనుకాదు. ఈ దానమిచ్చుట. ఇదియంతయు నాభార్య ప్రేరణచేతనే యిచ్చుచున్నాను. కనుక ఫలితము కూడ యామెకే చెందును. అని ఆయన యనెను. కనుక తల్లులందరును తమ భర్తలకు నచ్చజెప్పి పేదవారికి భూమిని ధనమును యిప్పించుడు.

కొందరు యెంతభూమి నుంచుకొనవలయునని యడుగుచున్నారు. బాబా యేమిచెప్పుచున్నాడనిన మీరు స్వయముగా నెంత వ్యవసాయము చేయగలరో అంత భూమిని యుంచుకొనుడు. బాబాను ఒకరిట్లు యడిగినారు. ''మాకు నూరు యకరములు భూమియున్నది. తమకెంత భూమి నివ్వమనెదరని యడిగిరి'' బాబా అంతయు నివ్వమనెను. పిమ్మట బాబావారితో మీరు స్వయముగా నెంతభూమిని సేద్యము చేయగలుగుదురని యడిగినా . పది యకరములని వారు జబాబు నిచ్చిరి. అంతమాత్రమే తీసుకొనుమని బాబా చెప్పినారు. ఇట్లే యందరు దానము చేయుడు. కృష్ణార్పణమనుచు దానము చేయుడు. ఇట్లు చేసిన మీకు యహంకారముండదు. మేము చేసినామని తలచినారా? అహంకార

మనుభూతము మీ నెత్తిమీద కూర్చొండును. ఆ భూతము బ్రతికినంతకాలము మీ పైకెక్కి కూర్చుండుటేకాక చని పోయిన పిమ్మటకూడ మిమ్ములను వదలకుండ స్వర్గలోకము నకు తీసికొనిపోవును. అక్కడకూడ మిమ్ముల వదలిపెట్టదు. అక్కడనుండి మఱల మానవలోకములో పడవేయును.

అంతా మీరు మాకు సమర్పించిన మేము సమాజ మునకు సమర్పించెదము. మీరు రాయలసీమలో వారు. కొంచము కొంచముగా కాదు మీరివ్వవలసినది. అంతయు నివ్వవలయును.

తుంగభద్ర కాలువ వచ్చుచున్నది. ఈ భూమి బంగా రముకాగలదు. అప్పుడు మీరివ్వలేరు. కనుక యిప్పుడే సమర్పించుడు. బంగారమున్నచో సౌఖ్యముగా నుండవచ్చు నని మీరు తలంచవచ్చును. బంగారమున్నచోటికి దొంగలు వచ్చెదరు. అందువలన దొంగలభయముతో మేలుకొనవలసి వచ్చుచున్నది. హాయిగా నిద్రపోవుటలో సౌఖ్యమున్నది. ఆ సౌఖ్యము బంగారమున్నవారికి యుండదు. ఇప్పుడు మట్టి యున్నవారుకూడ మేలుకొనుచున్నారు. పొలము పైరువేసి నప్పుడు ప్రక్కవాని పశువులువచ్చిపడి పైరుమేయునను యుద్దేశ్యముతో మేలుకొనుచున్నారు. ప్రక్కవారు ఈ మేలుకొనినవారి పశువులు పడునను యుద్దేశ్యముతో మేలు కొనుచున్నారు. ఇప్పుడు ఒకరికొకరు పొరుగువారయ్యెను, వాని పశువులుపడి పైరు మేయునని వీనికి భయము. వీని పశువులుపడి పైరుమేయునని వానికి భయము. ఇట్లు పరస్పర

భయమునకు గురియగుచున్నారు. భగవంతుడు రాత్రిని, నిద్రకొఱకు, భక్తికొఱకు, దైవప్రేమకొఱకు, సమాధి కొఱకు, హరికథలు చెప్పుకొనుటకొఱకు, యిచ్చియున్నాడు. మనము పగలంతయు గాడిదవలె పనిచేసి, మఱల రాత్రి పూటకూడ మేలుకొనవలసి వచ్చుచున్నది. ఇప్పుడు రాత్రి కూడకాదు పగలే దొంగలు వచ్చుచున్నారు. ఆంధ్రలో పశ్చిమ గోదావరిజిల్లాలో జరిగిన యొక విషయము. ఒక సభకు ఆ యూరిలోని పెద్దవారు రాలేదు. ఎందుకు రాలేదని విచారించితే వారు సభకు వచ్చినచో ఇంటియందెవ్వరు లేక పోవుటచే దొంగలుపడి తోచుకొనిపోయెదరని రాలేదట. వారు సభకు వచ్చిన భూదానము చేయవలసివచ్చునని కాదు రానిది. ఇంటిలో దొంగలు పడెదరని పాపము. ఇదియెంత యాశ్చర్యము ?

అడవిలో పెద్ద జంతువులు హింసించునని చిన్న జంతువులు భయపడినట్లుగా గ్రామములలో మనుష్యులు ఒకరిని చూచి మఱియొకరు భయపడుచున్నారు. ఇక్కడ చదువు కొనినవారు కొందరున్నారు. వారు మా పుస్తకములనుకొని చదివి చదువులేనివారికి వినిపించగోరుచున్నాము. ఇచ్చట మాకు చాల శాంతిగానున్నది. మీరు శాంతిగా వినినారు చాల సంతోషము. మీ కెల్లఱకు మా హృదయపూర్వక వందనములు. ఓమ్.

13

# (4)

## కర్నూలు జిల్లా

**అద్దగిరి** **15-3-1956**

ఈదినము ప్రార్థనకనుకూలస్థలముగానున్నది. దైవ ప్రార్థనకు స్థలనిమిత్తము లేదు. హృదయమే యవసరమైనది. ఒకదృష్టిలో అన్నిస్థలములుమంచివే. అయినను ప్రకృతిరమణీయప్రదేశము చిత్తైకాగ్రత కనుకూలముగా నుండును. అందరు చక్కగాకూర్చుండవలయును. చేతులుకాళ్ళు కదలించకూడదు. నేత్రములు మూసికొనవలయును. మనస్సునేకాగ్రము చేయవలయును, మనస్సులో నేలాటి సంకల్పములుండకూడదు. ఈశ్వరుడేయుండవలయును. మొదట మౌనప్రార్థన యాదునిముషములుజరుగును. ఈ మౌనస్థితిలో పరమేశ్వరుని గుణములను జింతించవలయును.

పర్వతముల సాన్నిధ్యమున నదీతీరములలో జ్ఞానులుందురని వేదములలో చెప్పబడియున్నది. ఈ వేదవాక్య భావముననుసరించి చూచిన యిచ్చట జ్ఞానులుండవలయును. ఇంతసుందరస్థలములో నున్నవారు దుర్గుణములకు వశులగుచున్నారనిన విచారింపదగిన విషయము .

ఈదినము ఒకరు (రాజగోపాలరావుగారు) మాలో నొకరితోనొకరు కొట్లాడుకొనుటవలన మాశక్తులు వ్యర్థములగుచున్నవని చెప్పినారు. ఈకలహములకు కారణమేమని మేమడుగగా మాయంహాకారమేనని వారుచెప్పినారు. ఈ

యహంకారమువలన వచ్చెడిదేమున్నది. ఏమిలేదే! ఈ యహంకారము దేనివలన వచ్చుచున్నదనిన తనదోషములు తనకు తెలిసియు తనదోషములనుగూర్చి చింతింపక యితరుల దోషములగూర్చి నిందించుటయే కారణము. నిజమునకు యితరుల దోషములగూర్చికాదు విచారింపవలసినది. ఎవరి దోషములగూర్చివారు మొదట విచారించుకొనవలయును.

మనకడుపులో మలకూడిక యేర్పడినప్పుడు మనము బాధపడెదము. ఇతరులు బాధపడరు. ఈ దోషములుకూడ యెవరిదగ్గరయుండినవారే బాధపడెదరు. అంతే. మానవుడు తనను తాను క్షమించుకొనుచుండును. తనదోషములు వ్యక్తపడకుండ కప్పిపుచ్చదలచును ఇరుగుపొరుగువారు యేమి చేసినను తప్పుగాభావించుకొనును. ఈనది యెట్లుప్రవహించు చున్నదో చూడుడు. నిరంతరము ప్రవహించుచునేయున్నది. మానవుడు తనదగ్గఱనున్నభూమి, ధనము, యితరులకు ఇచ్చుచుండినచో మనకు మఱలవచ్చుచుండును. చెట్లునున కెంతయుపకారమొనర్చుచున్నవి. వానిఫలములను కోసికొని యాహారముగా తినుచున్నాము. ఆకులను కోసుకొను చున్నాము. నీడనహాయిగా పండుకొనెదము. కూర్చుందుము. మనమింతటితో నూరుకొనక చెట్లును నరుకుచున్నాము. అప్పుడుచెట్లు మనకెట్టి ప్రతిక్రియనుజేయుటలేదు. అట్లే దేవుని సృష్టిలోని కొండలు భూమి మొదలగునవన్నియ యుపకారము మును జేయుచున్నవి. ఈదిన మొకఆమె ఒకఆడబిడ్డపుట్టినదని ఆబిడ్డకు భూమిసంబంధమైన పేరుపెట్టవలె, నేమిపేరుపెట్టవల

యును. అనియడిగినది. ఆమెయుద్దేశ్యమేమి? పృథ్వి మనలను తల్లివలెపోషించుచున్నది. కావున భూమివలె తనబిడ్డకూడ పరోపకార పరాయణురాలు కావలయునని యామెయుద్దేశ్యము. బిడ్డలుపరోపకార పరాయణులు కావలయుననిన తలిదండ్రులు ముందు పరోపకారపరాయణులు కావలయును. భూమి పరోపకారవంతురాలే కాక, క్షమావంతురాలుకూడ. అందువలననే భూమికి క్షమయను పేరుకూడవచ్చినది. మనము భూమిమీద నడిచెదము, త్రవ్వెదము. ఆమె ఓర్పుతోనున్నది. అందువలననే మనము ఓతల్లీ! భూదేవీ! మాపాదస్పర్శను క్షమింపుము. అని ప్రార్థించుచున్నాము. స్వార్థపరులెవరో వారికి సౌఖ్యముండదు. స్వార్థత్యాగములో సుఖమున్నది. స్త్రీలు బిడ్డలకు స్తన్యమిచ్చుచుందురు. స్తన్యమిచ్చుట త్యాగము చేయుటయగును. ఆత్యాగము జేసి ఆమెయానందము ననుభవించుచున్నది. మఱియు రాత్రివేళ పిల్లలు ఏడ్చుచు తల్లులను నిద్రపోనీయరు. అప్పుడు తల్లులు అత్యంతయోరిమితో బిడ్డలనుజోకొట్టి ఏడ్పునుపశమింపజేసెదరు. ఈవిధముగా నిద్రమాని బిడ్డలను సాకుచు ఆమె యానందముననుభవించుచున్నది. తల్లి బిడ్డకొఱకు త్యాగము చేయుచున్నది. కొందరుతల్లులు తమబిడ్డలనుమాత్రము సాకుకొనుచుందురు. కాని ఇతరులబిడ్డలను ద్వేషించెదరు. అపకారము చేసెదరు. ఇట్లు చేయుట వారి తెలివితక్కువచేతనే. ఇట్టి తెలివితక్కువపని పెద్దపెద్ద దేశనాయకులుకూడ చేయుచున్నారు వారీవిధముగా చెప్పుచుందురు అన్ని దేశములలో భారతదేశమాన్నత్యమైనది. మనముభార

తీయులము యనెదరు భారదేశమందులకు మంచిదైనది? మాదికాబట్టి. మాదియను యభిమానముపోయినచో భారత దేశముగొప్పదికాదు. అల్లే ఫలాని బళ్లారిజిల్లా మారాష్ట్ర ములోనున్నది. అదికర్ణాటకులకు పోకూడదనెదరు. ఇటీవల నొకయమ్మగారు మాచెంతకువచ్చిబాబూ! బళ్లారియాంధ్రి రాష్ట్రిములో చేరినది. కర్ణాటకులకుపోవుచున్నది. ఇదియన్యా యము యనుచు కండ్లవెంబడినీళ్ళుపెట్టుకొనినది. సరే! బళ్లారి యాంధ్రిలో చేరును, అప్పుడుకర్ణాటకస్త్రీలు ఈమెకండ్లనుండి నీళ్లుకార్చినట్లే వారును దుఃఖాశ్రువులపడి చెదరు. ఈవిషయ ములో కొంచెముటోయిటోపోయినదానివలన మనకువచ్చెడి నష్టమేమికలదు. ఈకలహములకు వినియోగించుకాలమును సర్వమానవులమేలుకొరకు పనిజేసినమనకెంతయో సౌఖ్యము చేకూరగలదు. ఇట్టిదుఃఖాశ్రువుల తొలగించుటకే భూదా నోద్యమమువచ్చినది. ఇట్టిభేదములకు కారణము దేహాభిమా నము. సత్యదృష్టితో నాలోచించిన ఈదేహము మనదికాదు, ఈదేహాభిమానమును వీడినచో మనమింతకంటె ఎక్కువ సౌఖ్యమ్మునుభవించగలము. ఇప్పుడుబాబా స్వార్థపరుడై నచో నీభూములనిచ్చియుండరు. బాబా ఆహారముకొరకు రోజంతయు పనిచేయ వలసివచ్చెడిది. కష్టపడవలసి వచెడిది. ఇప్పుడు బాబాకు మంచియింటిని యిచ్చుచున్నారు. ప్రతిపని జేయుటకు సంసిద్ధముగా నున్నారు. స్వార్థముండినచో నొక పిల్లవాడుకూడ ఒకపనికీ సహాయపడడు. మెట్రిక్ పరీక్ష చదువుచున్నాను. కనుక తీరికలేదనును

ఇచ్చట కొందరు కొంచెముకొంచెముగా భూమిని యిచ్చినారు. మీరు కొంచెము కొంచెముగా నెందులకు యిచ్చెదరు? అంతయు నొకసారియే యిచ్చివేయుడు. నదీ జల మెంత వేగముగా నెక్కువగా ప్రవహించుచున్నచో అంతజల మెక్కువ వేగముగా వెనుకవైపునుండి వచ్చుచుండును. మీరెంత యుదారముగా నుండెదరో సంఘము మీ కంతగా నిచ్చును. భూమినంతయు నివ్వమనినచో మా పిల్లవాడు చదువుచున్నాడు. మాకు 30 ఎకరముల భూమి యున్నది. దానిలో వచ్చిన ఫలితమంతయు వాని చదువునకే యైపోవుచున్నది అనుచున్నారు. దేనికో యింత ఖర్చుపెట్టి వీరు చదువుచున్నది. సౌఖ్యముగా నుండుటకుకదా? ఈ చదువులు చదివినవారికందరికి యిపుడుద్యోగములు దొరుకుటలేదు. ఉన్న యుద్యోగములు స్వల్పము. ఎందరికని రాగలవు. పంచవర్ష ప్రణాళికను మానదకు కొనివచ్చి ప్రభుత్వము మమ్ము సలహా నడుగగా మేమిట్లు చెప్పితిమి. M. A లకు B. A లకు యుద్యోగమునకు సంబంధం పెట్టవలదని చెప్పినాము. ప్రభుత్వోద్యోగమునకు B. A పాసులకు సంబంధమేమిటి, అవసర కార్యము నెవరు బాగుగ చేయగలరో వానిని యీ కార్యమునకు నియమించవచ్చును.

ఇదియునుగాక మా యమ్మాయికి పెండ్లిచేయవలెను. పదివేల రూపాయలు కట్నమిచ్చిననేగాని భర్తరాడు. అని కొందరు చెప్పుటకలదు. సరియే! మీ యల్లునకు పదివేల రూపాయల నివ్వవలయును. మీ కుమారునకు కన్నెనిచ్చిన

వారివద్దనుండి మఱల మీరు పదివేల రూపాయలు తెచ్చు కొనెదరుకదా ? మీరు దేనికివ్వవలయును ? దేనికి తెచ్చు కొనవలయును ? పెండ్లి పవిత్రప్రేమతో జరుపవలసిన కార్యము. ధనమునిచ్చుటతో పెండ్లి సంబంధమును ముడి పెట్టిన ప్రేమభావము తెగిపోవును. ఈ సందర్భమున యొక కథ జ్ఞప్తికి వచ్చుచున్నది.

ఇద్దరు పేదబ్రాహ్మణులు కాశికిపోయినారు. వారు పురాణధర్మములయందు విశ్వాసముగలవారు. పురాణము లందు కాశియందు బ్రాహ్మణునకు దానముచేసినచో మహా పుణ్యమురాగలదని చెప్పబడియున్నది. ఆ వాక్యమునందలి విశ్వాసముచే వారికి కాశియందు ఏదేని దానము చేయ వలయునని కుతూహల ముదయించెను. అయితే పాప మూ బీదబ్రాహ్మణు లేమియివ్వగలరు ? అందులో నొక బ్రాహ్మ ణుడు తెలివిగలవాడు. అతడు రెండవ బ్రాహ్మణునితో చేయిబట్టమని తాను జలములవదలుచు "నీవు బ్రాహ్మణు డవు ఇదిగో నీకు యొకలక్ష రూపాయలు దానము చేయుచున్నాను. మఱల రెండవ బ్రాహ్మణునిచే జలముల తన చేతులో పోయించుకొనుచూ నేను బ్రాహ్మణుడను. కనుక లక్ష రూపాయలు దానమొనర్చుచున్నానని వాగ్ద త్తము చేయమనెను. ఆ రెండవ బ్రాహ్మణు డట్లేచేసెను. వారిరువురు దానము జేసినట్లు తృప్తినొందగలిగిరి. మన పెండ్లిళ్ల సందర్భకట్నములు యిచ్చుటయుకూడ ఇట్లేజరుగు చున్నది. ఈ యలవాటువలన కొందరు పేదజనులకు మహా

సంకటములు పెండ్లిళ్ల సమయమున సంభవించుచున్నవి. ఇకమీదట పెండ్లిళ్ల విషయములో కట్నములనిచ్చి పుచ్చుకొను యలవాటును మీరెల్లరు వదలిపెట్టుడు. ఇక మేము నిలుపుచున్నాము. మా సోదరులు యింతకుపూర్వము కొన్ని వాక్యముల జెప్పినారు. పరమేశ్వరుడు మీకు సద్బుద్ధి నిచ్చుగాక! మీరెల్ల రాయురారోగ్యవంతు లయ్యెదరుగాక! ఇచ్చట మా పుస్తకములు కొన్ని కలవు. చదువుకొనిన వారు తీసికొని చదువుకొనని వారికి చదివి వినిపింపుడు.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

## (5)

## కర్నూలుజిల్లా

**కోడుమూరు** **16-3-56**

ఇంతమంది కలసి ఈశ్వరుని ధ్యానించుట మీకు క్రొత్త విషయము. నేటికీవిషయము క్రొత్తదే! అయినను ఈవిధముగా సాముదాయిక సాధన జేసినచో ఈ సాధన పాతదై, వ్యక్తిగతాభిమానము నశింపజేయగలదు.

మన భారతదేశములో వ్యక్తిగత సంస్కారణము లున్నవి. వ్యక్తిగతముగా నింటిలో యూడ్చి శుభ్రపఱచుచున్నారు. ఆ యూడ్చిన మలినమును వీధిలో పోయుచున్నారు. ఇప్పుడు వ్యక్తిగతముగ శుభ్రముజేసికొనుట సమష్టిగతముగ

మలినమొనర్చుట జరుగుచున్నది. ఉదాహరణమునకు వ్యక్తిగతముగా శుభ్రముగా నుండెదరు. సమష్టిశుభ్రత నాలోచింపరు. సమష్టిశుభ్రతను మనవారు యాలోచించువారైనచో యూరిలో నందరు నీరు తెచ్చుకొను భావులవద్దనెంతయో మురికి కనబడుచున్నది. ఇట్లుండుటకు కారణమేమి? మనవారు సమష్టిశుభ్రత నాలోచించకపోవుటయే కదా! కొందరు తమ గృహములలో ప్రేమను కనుపఱచెదరు. కానీ తమ గ్రామమునందలి యందరి గృహములయెడ ప్రేమను జూపింపరు. అంతేకాదు కొందరు తమ గ్రామములలో జరుగు కలహముల బాపుకొనుటకు ప్రయత్నించెదరు. కాని పట్టణములలో జరుగు కలహములగూర్చి, రాష్ట్రములో జరుగు కలహములగూర్చి, దేశములో జరుగు కలహములగూర్చి యావత్ప్రపంచకలహములగూర్చి యాలోచించి, వాటి నివారణకు ప్రయత్నింపరు. ఈ వ్యక్తిగత శుభ్రతతోపాటు సమష్టి శుభ్రతకు అందరు పాటుబడినచో కొలది కాలములోనె ప్రపంచమున, శాంతి సౌఖ్యములు నెలకొనగలవు. మన మెవరికిని బాధలుండకూడదని తలచుటలేదు. మనచెంత కెవరైన బాధపడుచు నరుదెంచినవారి బాధానివృత్తికి ఏకొంచెమో యిచ్చి పంపుచున్నాము. కొందరు యింటివరకే చక్కబెట్టుకొనుచున్నారు. కొందరు తమ కులమువరకు యభిమానము జూపుచున్నారు. మనకు సమష్ట్యభిమానముతోగూడిన సంస్థలు కావలయును. నింతవరకు కొన్ని కులభేదములుండినవి. ఆభేదము లిపుడు కొంచెము

తగ్గినవి. కొన్ని నిర్మాణ కార్యక్రమ సంస్థలు సమష్టిపరముగ పనిచేయవలెనని పెట్టినవి కలవు. అందుండు కార్యకర్తలు గూడ పరస్పర వైరములకు గురియగుచున్నారు. వారికి కలహములు సంభవించుచున్నవనిన వారిలో కూడ నేదియో స్వార్థమున్నదని యర్థము. అందువలన మంచివారు ఆ సంస్థలలో ప్రవేశించుటలేదు.

ఈ దేశములో సాంఘికభావము లేకపోవుటచే మనము వెనుకబడినాము. ప్రతి కార్యమును మనము సాముదాయకముగనే నేర్చుకొనుటకు యత్నింపవలయును.

భారతదేశములో సమష్టిభావము లేకపోవుటకు వేరు వేరు కులములు వేరువేరు భాషలు వేరువేరు జీవితవిధానము లుండుటయే కారణము. శ్రీ గాంధీగారు జీవితమంతయు స్వరాజ్యముకొఱకు వినియోగించినారు. ఆయన హిందూ మహమ్మదీయ భావమును, కులభేదములను చాలవరకు మాన్పించినారు. అందుచే నందరుకలసి పనిజేయుటచే స్వరాజ్యము వచ్చినది. ఇప్పుడు మఱల హరిజను లొక మూలబడియున్నారు.

మహమ్మదీయులు మాకు వేరు రాష్ట్రము కావలయునని పంచుకొనినారు. దాని పరిణామముగా హిందూ పాకిస్థాన్ కలహము లేర్పడినవి. గాంధీగారు ఈ వ్యతిరేక వాతావరణమును బాపుటకు కృషిచేయుచు బలియైనారు. ఈ సంఘటన యెట్లున్నదనిన బందిపోటు దొంగలందరు కలిసి

గ్రామముల దోచికొనివచ్చి పంపకము చేసికొనినపుడు నొక రితో నొకరు కలహించుకొనుట కలదు. అట్లే స్వరాజ్యము కొఱకు మనవారు సల్పిన కృషియును ఉన్నది. గాంధీ గారు వ్యాసదేవుని పరిస్థితిలో నుండి పరమ నిర్వాణము బొందినారు. వ్యాసదేవుడు నాలుగు వేదములను విభజించి నాడు. పదునెనిమిది పురాణములు రచియించినాడు. జీవిత మంతయు నెన్నియో మంచికార్యముల చేయుచు పరమ పవిత్ర ధర్మమును లోకమునకు తెలిపినాడు. అంత్యమునకు తన బిడ్డలే కలహించుకొని ఆహుతియైనారు. ఈ విషయ మాయన యొక సుందరమైన శ్లోకములో చెప్పినారు. ఏమి చెప్పిరనిన, అనేక ధర్మములను నేను చెప్పియుంటిని. వీనిని తెలిసికొని ఆచరించువారు కనబడలేదనిరి. మహాత్మాగాంధీ సకలసమాజైక్యభావములను చెప్పినారు. ఆయన తలచిన కార్యము నెరవేరలేదు. గాంధీ చరిత్రనుండి వచ్చిన పాఠ మిది. గాంధీ పోయినతర్వాత సర్వమానవ సమైక్యముకొఱకు మూడు సంవత్సరములు తిరిగితిని. ఏయొక నిర్ణయము పొడ కట్టకపోయినది.

ఒకనాడకస్మాత్తుగా భూదాన సంఘటన సంభవించి నది. ఇందులో నానందము కలిగినది. ఎందువలన ననిన మొత్తము భారతదేశము నైక్యముజేయగలమను ధైర్యము వచ్చినది. ఇంతవరకు వ్యక్తిగత యాస్తిపై హక్కు యుండి నది. ఈ భూదానోద్యమముద్వారా భూమిలేనివారికి దాన మిప్పింపవచ్చునని తలచితిని. ఇందులో సామూహికశక్తి

సంభవించుచున్నది. మొదట భూదానము లభించినప్పుడు నా కాళ్ళు తడబడినవి. పిమ్మట హరినామమును స్మరించి ఈ పనికై పూనుకొనినాను. అప్పుడు మేమింత పరిణామము జరుగునని యనుకొనలేదు. భారతదేశములో మహాత్ముల యాశయములు వారు బ్రతికియున్నప్పటికంటె దేహమును వీడినపిమ్మటనే బాగుగా జరిగినవి. ఇప్పుడు బాబా ఎంత మంచివారు యని అనుచున్నను పూర్ణముగా సర్వప్రజలు బాబా యాశయముల ననుసరించుటలేదు. బాబా దేహమును వదలి శూన్యములోనికి పోయినచో అప్పుడు చేసెదరేమో! కస్తూరిమాత బ్రతికియున్నపుడు స్త్రీలకు అవసర విషయములు లేకపోలేదు. అప్పుడు ధనముతో నవసరముండెను. కాని యామె పోయినతర్వాత పెద్ద నిధిని ప్రోగుచేసినారు. ఆమె పోయినపిమ్మట సహకారము లభించినది.

ఈ భూదానోద్యమము నారంభించినపుడు ఈశ్వరుని సహకార మొనర్పుమని ప్రార్థించితిని. ఇంత సహకారము దొరుకునని నేనపుడనుకొనలేదు. ఇంతమంది సహకారము దొరికినదనిన నా కాశ్చర్యముగా నున్నది. ఇప్పుడెందరో యీ పనిని జేయుచున్నారు. కాంగ్రెసు నిర్మాణ కార్యకర్తలుగూడ యిప్పుడిపుడే కండ్లు నులిమికొనుచున్నారు. మేము చనిపోవుటకుముందే యింత సహకారము లభించుట తలవనిపని. నేను సహకారమును పొందవలయుననిన హరి నామమును స్మరియించి శూన్యములో నుండుటయే! ఇక్కడ చాలమంది చేరియున్నారు. ఈ పనికి మీరెల్లరు పూనుకొని

నచో యీపని ఎంతబాగుగా జరుగగలదో! బాబా మీ యందరి కల్యాణమును చేకూర్చునని తలచవలదు. బాబా వలన ఏ సమస్యయు పరిష్కారము కాదు. రాముడు, కృష్ణుడు వచ్చిపోయినారు. సమస్యలు యింకా యుండనేయున్నవి. మీ సమస్యలను మీరే పరిష్కరించుకొనవలయును. సోదరులారా! నన్నెన్నుకొనమని మీకు నేను జెప్పుటలేదు. మీ యందరిని నేనే ఎన్నుకొను చున్నాను. ఇప్పుడు 1957 వ సంవత్సరాంతమునకు ఈ సమస్యను పూర్తి చేయవలయునని యనుకొనుచున్నాను. ఇంక నొకటిన్నర్ర సంవత్సరకాలముమాత్రమే యున్నది. ఈ లోపల ఎట్లు ఈ కార్యము జరుగునని సందేహపడ నవసరములేదు. భారత యుద్ధము పదునెనిమిది దినములలో జరిగినది. ఇంత పెద్దయుద్ధము పదునెనిమిది దినములలో నెట్లు పూర్తియైనదా యని యనిపించవచ్చును. కాలము సమీపించినచో నెంత ఘనకార్యమైనను స్వల్పకాలములోనే జరుగును. మనము దీపావళిని చేసికొనుచున్నాము. భారతదేశమంతయు నొక్క నాడే దీపములను వెలిగించుకొనుచున్నారు. బాబా ప్రతి వారియింటికిపోయి దీపము వెలిగించుటలేదు. ఎవరికివారే దీపములను వెలిగించుకొనుచున్నారు. మేము చెప్పెడివిషయము సర్వుల కర్థమైననాడే భూమి పంచుట పూర్తికా వచ్చును. బీహారులో రెండు మూడు దినములలోపలనే మూడు వందల గ్రామముల భూమిని పంచుట జరిగినది. ఇదేవిధముగా భారతదేశమంతయు జరిగినచో కొన్ని దిన

ములలోనే భూపంపకము జరుగగలదు, నిన్న యీదినం రాజగోపాలరావుగారితో మాట్లాడుచున్నాము. మేము మాట్లాడెడివిషయము గ్రామరాజ్యములో నిర్మాణకార్య క్రమమును ప్రవేశపెట్టవలయునను విషయమునుగూర్చి ప్రతివారు పల్లెలకు పోవలయును. మురికి ప్రదేశములను శుభ్రపరచవలయును. పరస్పరైకమత్యమునుగూర్చి చెప్పవలయును. ఈ విధముగా మన కార్యకర్తలు బయలుదేరి పనిజేసినచో త్వరలోనే మన సమస్యలు తీరగలవు. మొదట శాంతియుతముగా మాట్లాడజాలమేమోనని సందేహపడితిని. కాని శాంతియుతముగా సభ జరిగినది. మీరెల్లరు శాంతిగానున్నారు. ఇప్పుడిక్కడ దొరికిన భూమిని చదివి వినిపించెదరు. ఇంతటితో నిలుపుచున్నాము. అందరికి భక్తిపూర్వక వందనములు.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

---

# (6)

## కర్నూలు జిల్లా

**పులకుర్తి** **17-3-1956**

ఈ దినము ప్రార్థనకు స్థల మనుకూలముగా నున్నది. ఇచ్చటి మట్టియంతయు బాగుగానున్నది. అక్కడక్కడ చిన్నచిన్న రాళ్లుయున్నను అవి యుండుటయు బాగుగా నేయున్నది. చిన్నచిన్నరాళ్లు యుండిన స్థలముపై కూర్చుండిన

చిత్తైకాగ్రత సులభముగా గలుగును. మేము నిత్యము నడచివచ్చినప్పుడు పొలములో కొంచెముసేపు కూర్చుండి ధ్యానము చేయుచున్నాము. చాలా యానందముగా నుండుచున్నది. చిన్న చిన్న మట్టిగడ్డలు రాళ్ళుయున్నను అవి మా ధ్యానమున కనుకూలపడుచున్నవి. మిక్కిలి మెత్తని స్థలము కూడ ధ్యానమున కంతగా బాగుండదు. మీ రెల్లరు కాళ్ళు చేతులు కదలనివ్వక కూర్చుండవలయును. కనులు మూసుకొనినకూడ మంచిదే. మనకు కనుపించెడి ఈ బాహ్యరూపములు నశించిపోవునవి. మనస్సులో కొన్ని మంచిభావములు కూడ యుండును. బుద్ధియందుకూడ యంతే. మనము దేనిని పరమేశ్వరుడనుచున్నామో, యద్యేది నిర్మలముగా నుండును. అట్టి నిర్మలవస్తువును, మౌనమునువహించి ధ్యానించవలయును.

## ఉపన్యాసారంభము

ఈ రోజు యీ యూరిలో నుండుట మా యింటిలో నున్నట్లున్నది. మే మెక్కడికిపోయినను పరాయిస్థలము కాదు. అంతయు మాయిల్లే. మాకు పరమాత్మనుండి ప్రపంచదృష్టికి వచ్చుటయే పరదేశమునకు వచ్చుట. నేము ప్రతియూరికి పనిచేయుటకై వచ్చుచున్నాము. కొన్ని గ్రామములలో మా పనిని యంగీకరింపనిస్థితిలో నున్నారు. అట్టి స్థలములే పరదేశములగును. ఆ గ్రామములను పరదేశములుగా మేము చేసికొనలేదు. మేము ప్రపంచమంతయు మా

యిల్లేనని యనుకొనుచున్నాము. కొన్ని గ్రామములు వారి స్వభావము ననుసరించి ఆ గ్రామముకూడ మా యిల్లేనని చెప్పుటకు వీలులేకున్నది. ఇప్పు డీ యూరికివచ్చినపిమ్మట యిది మాయిల్లేనని యనిపించినది. దీనికి కారణము యిక్కడ నున్న యొక సోదరుడు పదహారు సంవత్సరముల క్రిందట రాయవేలూరు జైలులో నాతో కలిసియుండిరి. నేను రాయ వేలూరి జైలుకు వచ్చుటకుముందు నాగపూరు జైలులో నుంటిని. అప్పుడు అచ్చట జైలులోనున్నవారు ప్రభుత్వము నకు వ్యతిరేక భావముల ప్రకటించెదరని వారిని వేలూరుకు పంపించిరి. అందులో మేముకూడ రావలసివచ్చినది. నాగ పూరు జైలునుండి వేలూరు జైలుకు మేము వచ్చునప్పటికి యుదయము నాలుగు గంట లైనది. అప్పుడు అక్కడ జైలువారు మీ రెందుకువచ్చినారు? మీ కేమి యవసరమో చెప్పిన చేసెదమనిరి. అప్పుడు మేము రెండు కోరికలు కోరి తిమి, ఒకటి నేను నాగపూరునుండి వచ్చియుండుటచే శిరస్సు శరీరము ధూళిచే నిండియుండెను. ఆ భారము పోవుటకై మొట్టమొదట మంగలిని పిలిపించి క్షౌరము చేయించ మంటిని. ఇది దక్షిణదేశము. ఇక మొద లిచ్చటనేయుండె దను. కనుక నూతన వెంట్రుకలు రాగలవు. రెండవ కోరిక యేమనిన అరవము చెప్పెడివారి నెవరినైన యివ్వమంటిని. అప్పుడు వారు మా యుద్దేశ్యము ననుసరించి, ఈ రెండు కోర్కెలను తీర్చిరి. అప్పుడు తమిళము, తెనుగు, కన్నడము, మళయాళము, ఈ నాలుగు భాషలను నేర్చుకొనుటకు

యారంభించితిని. అప్పుడు కొందరు మీరు నాలుగుభాషల నొక్కసారియే యవలంబించినారేమని యడిగిరి. ఈ దక్షిణ దేశములో నాలుగు భాషలున్నవి. కనుక నాలుగు భాషలను నేర్చుకొనుచున్నానని చెప్పితిని. అప్పుడు నేతి చలపతిరావు గారుకూడ మాతో జైలులోనున్నట్లు జ్ఞాపకము. అప్పుడీ గ్రామములోని సోదరుడుకూడ మాతో జైలునందుండెను. అప్పుడు యిరువది రోజులు మే ముపవాసము చేసినాము. అప్పుడు చాలామంది పరిచయమైనారు. చాలా మంచిమంచి యాలోచనలు చేసికొనెడివారము. అప్పటి పరిచయములు హృదయపూర్వకమైన పరిచయములు. దేనిచేతననిన జయిలులో నందరు యొకేస్థలమున కలిసియుండవలసి యుండును. 24 గంటలు యొకేచోటనే యున్నప్పుడు హృదయము నందలి యభిప్రాయములు దాచడమనునది జరుగదు. ఈ రోజు సహజముగానే యా రోజులు జ్ఞాపకమునకు వచ్చినవి. మరల జైలులో కలుసుకొనే రోజులు రావేమో ననుకొనెదను. అయితే భూమియాజమాన్యము పోవలెనని తీవ్రముగా మేము ప్రచారము చేయబూనినచో జైలుకుపోయెడి పరిస్థితి యేర్పడవచ్చును. అయితే జనులు మా భావములకు చాల యనుకూలముగా నున్నారు. అందుచే నాస్థితి జరుగదేమో నని తోచుచున్నది. ప్రభుత్వమువారు మాదగ్గఱకు వచ్చిన ప్పుడు భూమిపైన యాజమాన్యము పోవలెనని చెప్పగా నాశ్చర్యపడుచున్నారు. అవును క్రమముగా చేయవలెనను చున్నారు. ఆరవభాగము యిచ్చినవారిదగ్గఱ తీసికొని విర

మించుకొను విషయములో మాత్రము మాకు జైలుకుపోవు పరిస్థితి రాదు. భూమిపై సంపూర్ణ యాజమాన్యము వదలు కొనవలయునని చెప్పినప్పుడుమాత్రమే మాకు జైలుకుపోవు పరిస్థితి యేర్పడును. భూమిపై యాజమాన్యము తొలగించుట జరుగును. ముప్పదికోట్ల యకరముల భూమిమీద యాజమాన్యమును దొలగించుటలో ప్రయాసయున్నది. 5 కోట్ల యకరముల భూమిని తీసుకొనడములో పెద్ద ప్రయాస కాదు. ఇప్పుడీ విషయము మా జైలులో పరిచయమును గూర్చి యాలోచించగా తోచినది. మేము నిత్యము యాలోచనా తత్పరులుగా నుందుము. ఆలోచనలు లేనప్పుడు జీవితమే లేనట్లు మేము తలచెదము. ఇప్పుడు భూదానోద్యమములో నొక్కరు రెండు మాసము లుండిపోవుచున్నారు. వారు నిత్యము నూతన భావములు వచ్చుచున్నవని చెప్పుచున్నారు. ఆలోచనలు లేకపోయిన ఈ భావములు రావు. ప్రతివారు యాలోచనాతత్పరులుగా నుండవలయును. ఆలోచన లేనివారు జడములవంటివారు. పొలములో స్త్రీలు, పురుషులు, పిల్లలు, పనిచేసికొనుటకు పోయెదరు. పని సాయంత్రమువఱకు చేసికొని కొంచెముసేపు ధ్యానము చేసికొనిన మంచి భావములు పొడకట్టగలవు. హృదయము నిర్మలమగును.

ఇక్కడికి యుదయము మేము వచ్చినప్పుడు ఈ యూరిలో నూటికి యెంతమంది చదువుకొనినవారున్నారని మేమడిగితిమి. నూటికి అయిదుమంది యున్నారని చెప్పి

నారు. నా కాశ్చర్యము కలిగినది. భారతదేశములో నూటికి పదహారుమంది చదువుకొనినవారున్నారు. కొన్ని తావుల యెక్కువమంది చదివినవారుండవచ్చును. కొన్ని స్థలముల తక్కువమంది యుండవచ్చును. ఇప్పుడు చదివినవారు జ్ఞానులని మా యుద్దేశ్యముకాదు. చదివినవారిలో విద్యావిహీనులు చాలామంది యున్నారు. వారికి బి. ఏ. యం. ఏ. యను బిరుదులున్నవి. కొమ్ములుకూడ మొలచినవి. చింతన మీద మన మాధారపడి యుండవలయును. ఇప్పుడు చాలా మంది చదివినవారున్నారు. చాల గ్రంథములున్నవి. యోగులు సాధుపురుషులు పుస్తకముల వ్రాసియున్నారు. మా పుస్తకములుకూడ కొన్నియున్నవి. ఇప్పు డాంధ్రలో మూడుకోట్ల మంది జనులున్నారు. భూదానోద్యమములో పాల్గొనినవారు యేబదియుందికి పైగాలేరు. ఈ విషయమును గూర్చి యాలోచించగా నా భారతదేశములో యాత్మశక్తి క్షీణించుచున్నట్లు తోచుచున్నది. నిజముగా మనము జైలులోనుండుటయన విశాల ప్రపంచమంతయు నాదియను భావమును మఱచి అల్పమైన యే కొంచము భూమినో గృహమునో నాదియనుకొని ప్రాకులాడుటయే. ఇంతకంటె జైలు మఱియేమికలదు? జైలునుండి యారుబైటకు వచ్చినచో మంచిగాలి వచ్చుటచే హాయిగా నుండును. మనము యీ కొంచము గృహము కొంచము భూములు నావియను జైలునుండి సర్వము నేననుకొనినచో నారుబైటకు వచ్చిన వారివలె యానందము ననుభవించెదము. మన పూర్వులు

జీవితమంతయు చక్కని నియమవిధానయుతముగా నేర్పరచు కొనినారు. బాల్యజీవితము బ్రహ్మచర్యముతో విద్య నభ్య సించుటకు, ఈ విద్య నభ్యసించువారు రాజకుమారులుగా నున్నను, గురువుల చెంతకుపోయి భిక్షచేసికొనుచు చదువ వలసినదే. ఈ విద్యతోపాటు శరీరపరిశ్రమనుకూడ నేర్పు కొనుట సంభవించుచున్నది. పిమ్మట గృహస్థాశ్రమములో ప్రవేశించి యతిథి యభ్యాగతుల నాదరించుచు కాలము గడపవలసియున్నది. తరువాత వానప్రస్థాశ్రమములో ప్రవే శించవలయును. వానప్రస్థాశ్రమములో భార్యా సంబంధముం డదు. ఆమె శిష్యులకు తల్లిగాను, భర్తకు సోదరిగాను బరి గణింపబడుచుండును. అప్పుడు తాను చిన్నతనములో నేర్చిన విద్యను విద్యార్థులకు చెప్పుచు, దైవచింతన సలుపుకొను చుండును. పిమ్మట సన్యాసాశ్రమములో నన్నికార్యములు వదలి బ్రహ్మైక్యహృదయుడై యుండును. గృహస్థాశ్రమ ములో నున్నవారుపై మూడాశ్రమములవారిని యాదరించ వలసియుండును. తమ యింటికి తక్కిన మూడాశ్రమముల వారు వచ్చినప్పుడు తమకంటె యెక్కువగా సౌకర్యములు వారికి కల్పించవలయును. అందుచే నక్కడ త్యాగమున్నది. ఇప్పుడు యట్లు జరుగుటలేదు. జీవితమంతయు గృహస్థాశ్రమ ముతోనే గడుపుట జరుగుచున్నది. వానప్రస్థాశ్రమము లేదు. బ్రహ్మచర్యాశ్రమమును లేదు. సన్యాసాశ్రమమును ఎవరైన యొకరు సన్యాసమును తీసికొనినచో, ఎప్పుడు తీసికొనెదరనిన పది పదిహేను దినములలో చనిపోవునప్పుడు,

సన్యాసాశ్రమమును తీసికొనెదరు. మాకు తెలిసిన యొక సన్యాసి యుండెడివారు. ఆయన పదిహేను పదహారు సంవత్సరములనుండి సన్యాసిగా నుండిరి. ఆయన యొకప్పుడు నాతో నిట్లనినారు. నేనింతకాలము బ్రతుకుతాననుకొనినచో సన్యాసమును తీసికొని యుండెడివాడను కాదు. అనెను. సన్యాసము తీసికొనిన తొందరగా చనిపోయెదనని యను కొనినావాయని నే నడిగితిని. కాదు కొన్ని దినములలో చనిపోయెదనని తలచి సన్యాసము స్వీకరించితిన నెను. ఆయన రెండు మూడు నెలలలో చనిపోయెదనని తలచుచుండువాడు. సన్యాసము తీసికొనినపిమ్మట ఆయనకు దేహారోగ్యము పెరిగినది. సన్యాసము తీసికొనినచో జీవితము పెరుగును. సంకల్పములు వదలినచో దేహారోగ్యము పెరుగును. ఆయుస్సు హెచ్చగును. ఈరోజు సన్యాశ్రమమును స్వీకరించువారు కొలదిమందికూడ లేరు. మాకు తెలిసిన యొక వకీలు యుండెడివారు. ఆయన వకీలుపని చేయుచు సంపాదించుచుండెడివాడు. కొన్ని దినములకు ఆయన కుమారుడు వకీలయినారు. తరువాత వారిద్దరుకోర్టుకు పోయెడివారు. కొన్నిదినములకు మనమడుకూడ వకీలు అయి నాడు. అప్పుడుముగ్గురు కలిసి కోర్టుకుపోవువారు. ఇది మేము చూచినవిషయము. నేటి పరిస్థితి చాల భయంకరమైనది. కొంచముకూడ మనశ్శాంతి జనులకులేదు. ఎలుకలు పడిన కొంపమాదిరిగా మానవుల మనస్సులున్నవి. హృదయ దార్ఢ్యము లేదు. జల్లెడలో నీరుపోసినట్లు మంచివిషయమును

హృదయములో నిలుచుట లేదు. ఇక్కడకు యింతమంది వచ్చి నారు. మాకు కోర్కెలు లేవుయని చెప్పెడివారెవరు? వారి కన్నకోరి [redacted] మాకు కుమారుడున్నాడు. వానికి వివాహము కావలయును. సరే! కుమారుని పెండ్లియైనది. తరువాత మనుమడు పుట్టవలెను. ఆపిమ్మట మనుమనికి పెండ్లికావలెను. ఇట్లు యాలోచించుచుందురు. కడకు యమ ధర్మరాజు వచ్చును. అప్పుడు తీసికొని పోవుచుండును. నాకు విషయసుఖములననుభవించవలయు ననియున్నది. నన్ను వదలిపెట్టమనియు నెదరు. నీవువిషయ సుఖముల ననుభవించవలసియుండిన వచ్చెడి జన్మములో గాడిదగా పుట్టించెదనని యమరాజు చెప్పును. అప్పుడు కాదుకాదు నాకు కొందరు పగవారున్నారు. వారికేదైన హింస చేయ వలెనని దెరు. అట్లయిన తోడేలుజన్మ నిచ్చెదను నెదరు. ఇట్టివారెంతమందియుండినను ప్రయోజనమేమి? కొలదిమంది వైరాగ్యవంతు లుండిన యెంతో ఘనకార్యముల చేయ వచ్చును. భూదానయజ్ఞము మూర్ఖులతో నగునదికాదు. బాబా విస్తారమైన ఆత్మభావన వ్యాప్తము కావలయునని కోరుచున్నాడు. మనము యిల్లును వదలి బయటపడుటకు చూడవలయును. ఇంటిలోనే యభిమానముతో నుండిన యాత్మ జైలులో నున్నట్లే. అంత నేననుకొనిన యాత్మ యూరు బయటకువచ్చినట్లు. ఇంతటితో నిలుపుచున్నాను. అందరికి హృదయపూర్వక వందనములు

ఓమ్ శాంతిః

# (7)

## కర్నూలు జిల్లా

పెదమర్రివీడు 18-3-1956

మనము ప్రేమపూర్వకముగా భగవంతుని స్మరించవలయును. ఆయన చేసిన మేలును స్మరించవలయును. ఆయన మన హృదయములో నున్నట్లు తలంచవలయును. ఎక్కడ అహంకారము లేకయుండునో అచ్చట ప్రేమ బయలుదేరును.

## ఉపన్యాసారంభము

ఈ ప్రదేశము యుత్సాహమును గలుగజేయుచున్నది. ఇది సభ కనుకూలప్రదేశము. ఇక్కడ జనులు మా వాక్కుల వినవలయునను కుతూహలముతో నున్నారు. చాలమంది నిర్దోషులగు యమాయక జనులిచ్చటనున్నారు. ఇట్టి పల్లెలన్నిటికి పోయి ధర్మముల దెలుపువారు లేరు. ఎవరు యిట్టి యమాయకులకు మంచి ధర్మముల నేర్పుదురో వారు భగవంతునికి ప్రీతిపాత్రులయ్యెదరు. ఇచ్చట భూదానము చాల బాగుగా జరుగుచున్నది. ఇచ్చట ప్రజలలో శ్రద్ధయు నమ్మకమును గలవు. నమ్మకమున్న చోట కొన్ని విషయములు చెప్పవలయును. నమ్మకము తెలివి, ఎచ్చటనుండునో అచ్చట శ్రేయస్సు సంభవించును. నమ్మ

కము నూనెవంటిది. తెలివి యగ్నివంటిది. నూనెయుండిన అగ్గిపెట్టెతో జ్యోతిని వెలిగించవచ్చును.

ఈదినము కొందరు సాలెవారు మావద్దకు వచ్చి నారు. వారు పదిరూపాయలు మొదలు యాభై రూపాయల వరకు దానముగా నిచ్చినారు. మీ ఇంటిలో అయిదుగురు యన్నదమ్ములుండిన బీదవానిని ఆరవవానినిగా భావించుకొని ఆరవభాగము దానమును చేయుమని చెప్పుచున్నాను. అని చెప్పగా ఒకరిట్లు ప్రశ్నించినారు.

"మేము అయిదుగురుగా నిప్పుడు యుండవచ్చును. మఱల నింకొకరుకూడ పుట్టినచో, అప్పుడు ఆరుగుర మయ్యెదముకదా. అప్పుడుకూడ మేము ఆరవభాగము యివ్వవలయునా య"ని యడిగెను. అందుకు మేమిట్లు చెప్పినాము. "ఆరుగురు మీరైతే నేడవవంతు దానము చేయుడు. ఏడుగురు యున్నచో నెనిమిదవవంతు దానముచేయుడు. ఇచ్చట నున్నవారెల్లరు పేదవారే. వారికియున్న ఆర్థికము వారికి చాలదు. పెద్దపెద్ద ధనికులను, వ్యాపారస్థులవద్దకు పోయి సంపద్దానమడిగితే వారేమిచెప్పెదరనగా మా యాస్తియెంత? అంతా అయిదులక్షల పెట్టుబడి. అందులో ఈ రోజులలో సరిగా లాభములు వచ్చుటలేదు. మాకెన్నో ఖర్చులు పైగా సేల్ టాక్సు కట్టవలయును. మఱియు కుటుంబములో ఖర్చులు పెరిగిపోయినవి. ఇవి మాకు మంచిదినములుగా నుండలేదు. మాకన్న యీ కూలీలే సౌఖ్యముగనున్నారు. వారికేమియు దిగుళ్లులేవు. పనియుండిన చేసికొనెదరు.

ఆ వచ్చిన కూలీలతో హాయిగా జీవితమును గడుపుకొనెదరు, అని వారు చెప్పుటకలదు. వారు చెప్పినదంతయు నిజమే. వారికి నిజమైన సౌఖ్య మెక్కడనున్నది? ఈ యమాయిక జనులీ వ్యాపారస్థులనుజూచి శ్రీమంతులని తలచుచున్నారు. నిజమునకు వారిదగ్గర ఎక్కడున్నది లక్ష్మి? వారివద్ద కాగితపు ముక్క లున్నవి! వారు మీవద్దకు వచ్చెదరు. మీవద్ద పాలు, నేయి, ధాన్యములు, కూరలు మొదలైనవి యున్నవి. ఈ వస్తువులను మీరు లక్ష్మియని తలంచుటలేదు. కాగితపు ముక్కలేల లక్ష్మియని మీరనుకొనుచున్నారు. మీకు కాగితపుముక్కల నిచ్చి అవసరమైన నేయి, పాలు, పండ్లు పెరుగు, మజ్జిగ, ధాన్యము, కూరలు వారు తీసికొనిపోవుచున్నారు. మాకా కాగితపుముక్కలతో పనిలేదు. అవసరమైన వస్తువుల నన్నిటిని మీరే యుత్పన్నముచేసికొనుడు. మీరేమిసంపాదించుచున్నారో, అందులో యారవవంతు లేని పేదవారికి పంచిపెట్టుడు. మీరు ఆరుగురైతే ఏడవవంతు పంచుడు. మీరుయిచ్చిన డబ్బు మేము పుచ్చుకొనము. అది మీరే వినియోగించుకొనవలయును. నిజమునకు మీరిచ్చిన డబ్బుఅంతయు తీసికొనివచ్చి కుప్పపెట్టినచో నాకు పరమసహ్యముగా నుండును. అయితే కొందర నెదరు "వారు మీరు చెప్పినట్లివ్వకున్న మీరేమి చేసెదరు"? నేనేమి చేసెదము! భగవంతుడు వారికాబుద్ధి పుట్టించినాడని తలంచెదము. ప్రేమనుగూర్చియూ ధర్మమునుగూర్చియు, చెప్పుటయే నా కర్తవ్యము. ఆంధ్రలో

కార్యకర్తలు లేరేయని మావారనుచున్నారు. ఈ సంపద్దానము చేసినవారందరు కార్యకర్తలేననితలంచుచున్నాము. వారు యిచ్చెడు సంపదను మఱల వారే పంచుదురు. అట్లు చేయుటచే వారు కార్యకర్తలగుచున్నారుకదా ! అందుచే నీ యుద్యమము విజయవంతము కాగలదని మా నమ్మకము.

బాబా భూదానోద్యమముద్వారా మిమ్ములను రక్షించగలడని తలంచుచున్నారు. మీ యుద్ధరణ మీ చేతులలోనే యున్నది. ఇక్కడ రోజూ దాతల పేర్లు చదువుచున్నారు. మేము వినుచున్నాము మే మాలోచించుచున్నాము. ఈ దానపత్రములతో పాటు ఒకరిద్దరు కార్యకర్తలు దొరకిన చాలును. ఈ కార్యము విజయోపేతముగా జరుగగలదు. సంవత్సరమునకు మూడు వందల యరువయి గ్రామములకు పోయెదము. మూడు వందల యరువదిమంది కార్యకర్తలు యూరి కొక్కరు వంతున దొరికినచో, కాగలరు. ఇదేవిధముగా పది సంవత్సరములు పని జరిగిన మూడు వేల యారువందలమంది కార్యకర్తలు లభ్యము కాగలరు. వారు మఱికొందరిని తయారుచేయగలరు. అపుడందరును ఈ విషయమును ప్రచారమును చేయగలరు. మీ యింటిలో నొక పెద్ద యుండును. ఆయన మీ క్షేమముల నరయుచుండును. ఆయన చనిపోయిన మీరు చింతించెదరు. అట్లే గ్రామరాజ్యము వచ్చినప్పుడు గ్రామములోనివారెల్లరు రొక కుటుంబముగా నుండెదరు. గ్రామమున నొక పెద్ద యుండి గ్రామములోనున్న వారిక్షేమముల నరయుచుండును.

మీ గ్రామములో గ్రామమునసబు (రెడ్డి) కరణము ప్రభుత్వ యుద్యోగులు. గ్రామక్షేమముల వారు చూచుటకొఱకై యుందురు. అట్లే యొక గ్రామమునసబువలె, బాబా మనిషి యుండును. ప్రభుత్వము నియమించిన గ్రామమునసబు ప్రజల క్షేమమును కొంచెము చూచుచు తనక్షేమము నెక్కువగా చూచుకొనుచున్నాడు. ప్రజలలో వచ్చిన పలుకుబడిని తన క్షేమమునకై వినియోగపఱచుచున్నాడు. బాబా మనిషి అట్లుగాక గ్రామమునందలి ప్రజల క్షేమమునే ముఖ్యముగా జూచి పిమ్మట తనక్షేమమును జూచుకొనువాడుగా నుండును. ఈ విషయము యందరికి చక్కగా నర్థమైనచో తొందరగా నీ యుద్యమము జరుగగలదు. ఈ విషయముల నర్థమగునట్లు సర్వులకు చెప్పెడివారే కొఱతగానున్నారు. బాబాను ప్రజలు యాహ్వానించుటకు ముందు పరమార్థ చింతనకలవారిని ప్రతి గ్రామమునను జూడవలయును. పరమార్థచింతనగల వ్యక్తిలేని గ్రామము స్మశానతుల్యము. పరమార్థచింతన కలవారు దొరకరని యనెదరు. రావణుడు సీతాదేవిని లంకకు తీసికొనిపోయినసమయమున, హనుమంతుడు సీతను వెదకుచు లంకకు పోయినాడు. ఆయన రామనామమును స్మరించుచు సముద్రమును దాటిపోయినాడు. లంకలో నెచ్చట దిగుటకును ఆయనకు బుద్ధిపుట్ట లేదు. రాక్షసులందరు క్రూరులగుటచే నచ్చట దిగుట కాయనకు యిష్టములేదు. అప్పుడొక యింటిలో రామనామము వినిపించినది. అచ్చట దిగినాడు. అదియే విభీష

ణుని గృహము. రాక్షసులుండిన లంకలోకూడ మంచివారు పరమార్థచింతనాతత్పరులు ఉన్నపుడు, ఈ ప్రదేశములలో మంచివారు లేకపోయెదరా? ఉందురు. మనము వారిని పట్టుకొనవలయును. వారిద్వారా ఆ యూరిలో మంచిపనులు చేయించవలయును. ఇప్పుడింతటితో విరమించుచున్నాము. ఇచ్చట మా పుస్తకములున్నవి తీసికొనుడు. పాప మీా పిల్లలకు పుస్తకములు చూడగనే తీసికొనవలయునని కోరిక. తీసికొని ప్రయోజనమేమి? చదువురాదు. ప్రభుత్వము మీా యొద్దనుండి కొంత పన్నును వసూలు చేయుచున్నది. మీా క్షేమమును జూచినట్లు కనబడుటలేదు, ఈ విషయము మీారడిగినచో, ఇదిగో యిచ్చటికి పది మైళ్ళ దూరములో నొక స్కూలు పెట్టినాము. అక్కడొక ఆసుపత్రి పెట్టినాము అని చెప్పుదురు. ఏ పదిమైళ్ళ దూరములో పెడితే మీాకేమి లాభము? ఇంకా వారిట్లు చెప్పెదరు, మిమ్ములను కాపాడుటకు పోలీసు దళమును పెట్టినాము. పోలీసులు లేకపోయినచో, మీా రొకరికొకరు నరుకుకొని చచ్చిపోయియుండెడివారు, అని చెప్పెదరు. ఈ పోలీసులచూచి ఈ పిల్లలు భయపడుచున్నారు. పోలీసులవలన మీాకు సంస్కారణమేమి జరుగును? ప్రతి గ్రామములో సజ్జను లుండెదరు. వారు ప్రతివారిని సంస్కరించి బాగుపరచెదరు. ప్రభుత్వముకూడ యిట్టి స్థలములలో, ఏదేని మంచి వ్యవస్థను కల్పించవలసియుండును.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# (8)

# కర్నూలుజిల్లా

## ఎమెగనూరు 19-3-56

### ప్రారంభంలో భగవత్ప్రార్థన

మన మనస్సులో ఈశ్వరుని గుణములను జింతించవలయును. దీనివలన చాల బాగుపడుట జరుగును. మనము దేనినైతే పరమేశ్వరుడనుచున్నామో అది సత్యము. శాంతముగా నేకాంతమున నేకాగ్రచిత్తులయియుండినచో, పరమాత్మని స్పర్శ మనకు కలుగును. మన దేశములో పరమేశ్వరుని యందు భక్తియున్నది. మనము గంధరగోళముగా కీర్తనల పాడి భజనచేయుటయే భక్తికాదు. మనము సమాజములోనున్నాము. కనుక దయాకరుణ ఇత్యాది సద్గుణములు కలిగియుండినచో నది భక్తియగును. మన మనస్సున జాగ్రతగా నుంచకూడదు. దానిని స్థిరముగా నుంచుకొనవలయును. అభ్యాస వైరాగ్యములద్వారా దానిని సుస్థిరపఱచవలయును. పెద్దగా నగువ పనిలేదు. దయా, ప్రేమ, వాత్సల్యము, మొదలగు సద్గుణముల నలవఱచుకొనవలయును. ఈ గుణముల యావశ్యకత యెంతేని కావలసియున్నది. ఇప్పుడు అయిదు నిముషములు మౌనప్రార్థన జరుపబడును. మేము మాట్లాడము. మీరుకూడ మాట్లాడవలదు. ఆపై మావిషయమును మీముందు పెట్టెదము.

41

# ఉపన్యాసారంభము

ఈదినమిక్కడ యవకాశము లభించినది. ఇది నేతవారుండెడి కేంద్రము. మా యభిమానులలో దరిద్రనారాయణుడొకడు. అందుచేత వీరిని దర్శించవలయునని కుతూహలముగానున్నది. మేము కూలీలవలె పనిజేసి ఆ పనిద్వారా గడపవలయునని తలచితిమి. వచ్చిన కొలది ధనముతో జీవితమును గడపవలయునని తలచితిమి. వ్యవసాయము చేసినాము. నూలు వడుకుట, నేయుట, పడుగు చేయుట, మొదలగు సమస్త పనులను చేసినాము అన్ని విధములైన నేతపనులును మాకు తెలియును. బావుల త్రవ్వుపని చేసినాము. పాకీపని చేసినాము. ఎందుకీపని చేసినాము. ఎందుకీ పనులనన్నిటిని చేసితి మన భారతదేశములో కనీసము కూలివానికి కూలి యెంతవచ్చునో అంత ఖర్చుతో జీవించవలయునను యుద్దేశ్యముతో చేసినాము. అంత స్వల్పఖర్చులతో జీవితమును గడిపినాము. సోదరులారా! నేతవారు, కూలీలనిన మాకు యెంతో ప్రీతి. ఈ కూలివారి కష్టనివృత్తికొఱకు 4 సంవత్సరములు చింతించినాము. ఈ విషయముకొఱకు చాలచాల ప్రయత్నముల నొనర్చినాము. కమ్యూనిస్టులు నైజాములో గందరగోళము చేయుచున్నసమయమున మేము పవనారునుండి నైజామునకు నడచివచ్చినాము. అప్పుడు భూదానోద్యమము ప్రారంభమైనది.

మన దేశము చాలకాలమునుండి చేతిపనులకు నిలయముగా నున్నది. నేతవారు చాల నేర్పరులున్నట్లు భారతదేశ చరిత్ర చెప్పుచున్నది. మనకు స్వరాజ్యము వచ్చినపిమ్మట మిల్లులు పోవునని తలచినాము. కాని యింతవఱకును తీసి వేయలేదు పైగా పాశ్చాత్యులు చదివించిన అర్థశాస్త్రములనిచ్చట చదివించుచున్నారు. పాశ్చాత్యులు ప్రజలు వారి యదుపాజ్ఞలలో నుండుట కనువగు విద్యను మనకు గఱపుచుండెడివారు. వారి విద్య మన మనస్సులను పవిత్రముగా జేయుటకుమాఱు పాడు చేసినది. మనవారా శాస్త్రములు చదువుకొనుటచేత మన చేతిపనులను నిరసించుచున్నారు. ఒక మంత్రి పాతవృత్తులను నిలుపుటకు వీలులేదు. ఈ పాతవృత్తులింకా దేనికియనినారు. ఏ పనివలన దమ్మిడీ ఖర్చులేకుండ యనేకమందికి బ్రతుకుతెరువు యేర్పడుచున్నదో, ఆ వృత్తులు పాతవని త్యజించవలయునా? మన ప్రభుత్వ విచారణ యిట్లున్నది. సంతోషవిషయ మేమన మిల్లుల కొంచము హద్దులో పెట్టవలయునని చెప్పుచున్నారు. కాని యెడెనిమిది సంవత్సరముల నుండియే నిర్ణయము కాలేదు. వారి మెదడు స్పష్టముగా లేకుండ యున్నది. అందుచే, నేతవారికి యేమూదాయమును వచ్చుటలేదు. ఇక్కడనే వడకడము నేసికొనుట మనము చేసికొనినచో సహజముగానే మిల్లులకు దెబ్బతగులును.

ఇక్కడున్న నేతవారు నేతమిల్లుల నంగీకరించుటలేదు. కాని దారముమిల్లులుండ వలయుననుచున్నారు. ఇంత

మూర్ఖలక్షణము వేరొకటిలేదు. దారముతీసెడి మిల్లుల నుంచిన నేతవారికందరికి పని దొరుకదు. అదియునుగాక దారపుమిల్లుల యజమానులకె యాదాయము పోగలదు. అనేకమంది బ్రతుకుతెరువులేక కష్టపడవలసి వచ్చును. మహాత్మాగాంధి చేతితో వడికిన నూలునే, నేతవారు నేయవలెనని చెప్పినారు. ఎందుకట్లు చెప్పిరన యనేకులకు బ్రతుకుతెరువు కల్పించుటకై. ఇప్పటివఱకు మామూలుగా వడికిన నూలు నేయడము నేతవారికి చాలాకష్టముగా నున్నది. ఇప్పుడు అంబరచర్ఖా వచ్చినది. ఈ చర్ఖాపైన మామూలుకంటే నాలుగురెట్లు నూలునధికముగా తీయుటకు వీలుండుటే కాక నూలు గట్టి నైసుగాకూడ వచ్చుచున్నది. 30 సంవత్సరముల నుండి గాంధీజీ పేదలు జీవనమునకు సరిపోవు నూలు వడుకుకొనుటకు తగిన రాట్నమును తయారుచేయుటకు ప్రోత్సహించుచు వచ్చెను. నేటికి తయారయినది. ఇది మొదలు అంబరచర్ఖా పల్లెపల్లెలో ప్రతికుటుంబములో నుండునట్లు జేయవలయునని యాశించుచున్నాము. అందుచేత నిక మిల్లులనూలుతో పనిలేదు. వడికిననూలునే నేయవలయునని మీరెల్లరు నిశ్చయించుకొన వలయును. భారత కాంగ్రెసు ప్రభుత్వముకూడ అంబరచర్ఖా వ్యాప్తికి కొంతదోహద పడెదమని చెప్పుచున్నారు. కొందరు బాబాను సనాతనుడనియు, విమానముమీదఁ రైళ్లు, కారులు మొదలగు వానిపై, దేనికి ప్రయాణము చేయకూడదనియు, అనుచున్నారు. బాబాకు విమానములు, రైళ్లు, కారులు, యుండుట వెగటుగాదు,

అవియన్నియు ప్రభుత్వ పరముగా నుండవలయును. మఱియు నిప్పటికంటె రైళ్ళు, బస్సులు, విమానములు, జనులు ప్రయాణము చేయుటకు విశాలముగాను, సౌకర్యముగా నుండవలయునని మా యభిప్రాయము విమానము నిప్పటి కంటె వేగముగా పోవునట్లు చేయవలయునని ప్రయత్నించు చున్నారు. మఱియు నిప్పుడు విమానములో ప్రయాణము చేయుటకు, కూర్చుండుట చాలాకష్టముగా నుండునను చున్నారు. ఇంకాబాగుగా కూర్చుండుటకును, నూలుకూడ వడుకుకొనుటకును, అనుకూలముగా వేగముగా పోవునట్లు విమానములను చేయుమని బాబా చెప్పుచున్నాడు. అయితే బాబా విమానము నెందుకు యెక్కలేదనిన విమానములో పోయినవారికి గాలి బాగుగా వచ్చుచుండును. బాబా భూమి మీద పోవుచున్నాడు. కనుక భూమి వచ్చుచున్నది. బాబా దేనికి వ్యతిరేకికాడు. అన్నియు నుండుట మాకిష్టమే. కాని ఈ యంత్రములు, బీదవారికి అన్నము లేకుండచేయునవిగా నుండకూడదు. అమెరికా దేశములో నొకమనిషికి పన్నెండు యకరముల భూమి సగటున పంచుకొనినప్పుడు రాగలదు. మన దేశములో సమానముగా సర్వులుపంచు కొనినప్పుడు అరయకరము కూడ రాదు. ఇట్టి ప్రదేశములలో యంత్రముల పెట్టి వ్యవసాయము చేయడము బాబాకు యిష్టము లేదు. ఇచ్చట యంత్రమునతో వ్యవసాయము చేయుటకు మొదలు పెట్టిన చాలమందికి పనిదొరుకదు. తిండి దొరుకదు. యంత్ర యజమానుల చేతులయందే ధనధాన్యములు నిలిచిపోవును.

ప్రభుత్వములో నుండే పెద్దవారు ఈవిషయములను వ్యక్త పఱచుట లేదు. వారేమి చెప్పు చున్నారనిన, దేశములో జనసంఖ్య పెరిగి పోవు చున్నది. దాని వలన ఆహారాది పదార్థములు చాలునట్లు కాన్పించుట లేదు, కనుక సంతాన నిరోధము చేసికొనవలసినది. మఱియునొకప్పుడు ఒక మంత్రి గారు యెక్కువ సంతానమును కనినవారికి పన్ను వేయవలెనని కూడ తెలిపినారు. ఈ మాటలను వినిన నవ్వు వచ్చుచున్నది. ఈ మంత్రుల చేతలలోనె జనులను పుట్టించుట పుట్టకుండ జేయుట జరుగునట్లుగా నున్నది. ఇప్పుడు ప్రజలు సంతాన నిరోధము నవలంబించినచో రేపు జనసంఖ్య తగ్గి పోయినచో ఈ మంత్రులు ఒక్కసారే జనులను పుట్టించ గలిగెదరు కాబోలు ! మంత్రులు ప్రజల జీతగాండ్లు. ఒక జీతగాడు మీయింట్లో యెక్కువ జనులుండిన నాకు అందరి పని చేయుట భారమగును? కనుక మీరు సంతాన నిరోధము చేసికొని కుటుంబ జనసంఖ్యను తగ్గించుకొనుడు. అని చెప్పిన యెట్లుండునో? వీరిమాటలు కూడ యట్లే యున్నవి. వీరు జనుల క్షేమమున కనుగుణ్య కర్మను చేయుటయే కర్తవ్యముగా పెట్టుకొనవలయును. ఈ జనాభా విషయము ప్రత్యేకము. జనుల నెట్లు పెంచవలయునో, సంతానము నెట్లు తగ్గించవలయునో, అను విషయము నైతిక ధర్మముపై అధారపడి యున్నది. శాసనములతో సంతాన నిరోధము చేయించుటకంటె మూర్ఖపుపని యింకొకటిలేదు. ఇప్పుడు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక వేసినారు. అంటే దీని కర్థమేమి

అంతా ప్లానులు, యంత్రము పని చేయును. దానికేమి యభిమానము లేదు. గాడిదకైన యభిమానమున్నది. ఏ యభిమానము లేని యంత్రముల పెట్టి దేహాభిమానముతో నున్న యనేకమంది జనులకు కూడు గుడ్డ కొంప లేకుండ చేయుట యెంత యన్యాయము. బాబాకు చర్ఖాయంటే అభిమానము లేదు. చర్ఖావలన చాలామందికి కూడు, గుడ్డ, కొంపలు, యేర్పడుచున్నవి. కనుక, చర్ఖాను వడకమను చున్నాడు.

ఇప్పుడు ప్రజల బాధలు స్థితిగతులు మంత్రులకు, నాయకులకు తెలియవు. వారు ఢిల్లీలో కూర్చుని యాలోచించుచున్నారు. వారు పల్లెలకు వచ్చుట లేదు. వారి యాతనా పరిస్థితుల చూచుట లేదు. వారు గ్రంధముల చదివి ప్రజల సమస్యల తీర్చుటకు పూనుకొను చున్నారు. ఆగ్రంధములు ఇంగ్లీషులో యేయమెరికావారో రచించిన గ్రంధములు. వారి పరిస్థితులు వేరు. మన పరిస్థితులు వేరు. వారు జీవితమును స్థాయినిపొందించుటకు యత్నించరు. శరీరమును పెంపొందించుటకు ప్రయత్నించెదరు. మనవారు వారి వైద్య గ్రంధములు చదివి వైద్యము చేయుచున్నారు. డాక్టరు పరీక్ష ప్యాసుకావలె నంటె యింట్లోవున్న ఆస్తియంతయు అయిపోవును. మరల పెట్టుబడిపెట్టిన ద్రవ్యమును సంపాదించుట కొఱకు యింకా సంపాదించుటకు పాప పుణ్యమనునది లేక, బీదసాదయను భావములేక, యందరిదగ్గఱ దోచుకొనుటకు ప్రయత్నము చేయును. ఇంతా యతడు నేర్చుకొనిన విద్య వాని సుఖముల్కై వినియోగపడినది. మహాత్మాగాంధీ

యనేకపర్యాయము లందుచేతనే స్వదేశీవస్తువులను స్వదేశ వైద్యములు వ్యాప్తికి తేవలయునని చెప్పినారు. కాని ఇప్పుడు కొందరుపెద్దలు స్వదేశ భావము విశ్వాత్మాభిమానము కలుగజేయదని చెప్పుచున్నారు. వీరిట్లు చెప్పుట మాకాశ్చర్యముగా నున్నది. వీరు మాకు వేదాంతమును జెప్పుచున్నారు. ఇది నాకాశ్చర్యమును కలిగించుచున్నది. వారు కావలయుననునదిదేమిటి? పరస్పరావలంబనము. అనగా కొంతమంది యొకపనిచేసిన మఱికొంతమంది యింకొకపని చేయవలెననెదరు. అనగా ఒక కుంటివాడున్నాడు ఒకడు గుడ్డివాడున్నాడు. కుంటివాడు దారిచూపించును. గుడ్డివాడు కుంటివానిని మోసుకొని పోవును. ఇట్లు సహాయము చేసుకొనవలెననెదరు. అందరు అన్ని అవయవములు కలిగి యున్నప్పుడు ప్రయత్నపూర్వకముగా కొందరు గుడ్డివారుగా కొందరు కుంటివారుగా తయారు కావలయునా? అసలు మనదేశములో నున్న పనులు మనకు చాలవు. ఎందరికో నిరుద్యోగసమస్య యేర్పడియున్నది. అయినప్పుడు మనదేశమందలి ముడిసరకు పరదేశములకు పంపి వారు వస్తువులు తయారుచేసి యిచ్చినవి మనము కొనివారికిద్రవ్యమును పంపి దరిద్రముతో తపించవలయునా? మన ముడిపదార్థముల వస్తువులుగా మనమెందుకు తయారు చేసికొనకూడదు? పరమేశ్వరుడు మనకన్ని అవయవముల నిచ్చినాడు. ~~ఈశరీరములో~~ నొకరికి యూపిరితిత్తులు లేకపోయినచో యూపిరితిత్తులు తీసుకొనిన ~~అవయవ~~ కండ్లను యిచ్చుట ~~ఇట్లే సహాయము చేసుకొనిన~~ బాగుండును.

ందరికి అన్ని యవయములున్నప్పుడు పరస్పరావంబనము దేనికి? ఇప్పుడు పట్టణవాసులు చేయునది యేమిటి? గ్రామవాసుల వృత్తులను గ్రామవాసుల వస్తువులను దోచుకొనుచున్నారు. ఈ రెండు పోవుటచే గ్రామములు బలహీనములైనవి. బాబా విదేశవస్తువులను నిషేధించుటలేదు. ఇదిగో ఈగడియారమును వాడుకొనుచున్నాము. కండ్లజోడు వాడుకొనుచున్నాము. ధర్మామీటరు వాడుకొనుచున్నాము. కలములను వాడుకొనుచున్నాము. ఇవియన్నియు మనకు తప్పక కావలసి వచ్చుచున్నవి. వీనినే మనపట్టణములలో తయారుచేయుటకు ప్రయత్నించుడు. ఇంతకంటె గట్టిగా, అందముగా నుండునట్లును ఇప్పటికంటె తక్కువ ఖరీదుకు లభ్యపడునట్లును తయారుచేయుడు. అప్పుడు పట్టణవాసులు పల్లెలలోనుండు వారి ముడివస్తువులను వృత్తులను లాగుకొనవలసినపని యుండదు. ఇప్పుడు పట్టణవాసులు యాలోచనలేకుండ విదేశీయులు చేసిన పెద్ద పెద్ద యంత్రములను ఇచ్చటికి తీసుకొనివచ్చి, వానితో నిచ్చట పల్లెలలోనుండు ముడివస్తువులుగా తయారు చేయుచు పల్లెలలోని వారికి పనిలేకుండ, కూడుగుడ్డ కొంపయు లేకుండ చేయుచున్నారు. వారును యాలోచనా విహీనులగుచున్నారు. విదేశములనుండి వచ్చు వస్తువులను తయారు చేయుటకు మనపట్టణవాసులు పూనికొనినచో వారియాలోచనలు పెరిగి వికాసవంతులగుటయే కాక మన పల్లెలలోనున్న వారికి వృత్తులకల్పించి దారిద్రమునుండి తొలగించినవారలయ్యెదరు. ఈదృష్టి చేతనే అంబరచరఖాను తయారు

చేయుటకు మహాత్మాగాంధీగారు ప్రోత్సహించి యుండెను. ఇపుడంబరచరఖా వచ్చినది. కనుక యికమీద మిల్లులలో తయారైన నూలును మీరు నేయకుండ యుండవలెననియు మిల్లుబట్టలు కట్టకుండ నుండవలయుననియు యాశించుచున్నాను. ఈవిధముగా జేసిన గ్రామములు బాగుపడగలవు. పల్లెపల్లెలయందు విరివిగా నూలువడకుకొని బట్టలు నేసికొనుచున్నచో భారతదేశములో కొలదికాలములో మిల్లులతో పనిలేకుండాపోవును మిల్లులయొక్క శక్తికి నేనిష్టపడుచున్నాను. ఏశక్తియైనను ఏపనియైనను అదిగ్రామము మొత్తముదై యుండవయును. పల్లెలలో ముడివస్తువులు అచ్చటనే అవసర వస్తువుగా తయారుజేసుకొనునట్లు చేయవలయును.

మేము అన్నియభిమానముల వదలిపెట్టి మాట్లాడుచున్నాము. ప్రతియొక్కరు తనవలె ఈబాధపడెడు జనులను చూచుకొని వారిబాధానివృత్తి కొఱకు వారితోకలసి యన్ని కార్యములు నాచరించవలయును.

ఓమ్.

# (9)

## కర్నూలుజిల్లా

కపటి 21-3-1956

అందరు చక్కగా నెదముందుకు వచ్చులాగున కూర్చుండవలయును. ఏవిధమైన శబ్దమును చేయరాదు. మౌనముగానుండి ఈశ్వరచింతన చేయవలయును.

## ఉపన్యాసారంభము

చిన్నచిన్న పల్లెలలో చిన్నచిన్న సభలు జరుగుచున్నవి. కాని ఈ చిన్నసభలే కొన్ని జరిగితే గొప్ప పనులను చేయగలవు. పాండవులు ఐదుగురు, పన్నెండు సంవత్సరములు యరణ్యములో సంచరించినారు. కౌరవులు నూరుమంది పాండవులరాజ్యమునుగూడ కైవశమొనర్చుకొని పరిపాలించుచుండిరి. అయినను పాండవులు కౌరవులను యుద్ధమునందు జయించినారు. ఈ శక్తి పాండవుల కెట్లు వచ్చినది? మూడు కారణములవలన వచ్చినది. ఒకటి పరస్పర ప్రేమతో మెలగెడివారు. అందుచే కౌరవులు వారి ముందు నిలువలేకపోయిరి. రెండు, ధర్మమును వదలువారుకారు. ప్రేమయున్నచోట ధర్మముండును. అప్పుడప్పుడు కోపతాపములు వచ్చినను ధర్మమును వదలువారు కారు. ధర్మముండినచోట ప్రేమయుండును. ఒకసారి భగవంతుడు, వారి ధర్మమును, ప్రేమను, పరీక్షింపదలచినాడు. ఈ

పరీక్షలో వారి ప్రేమధర్మములు, బయటపడినవి. భారత యుద్ధమునకు ముందుగా, నర్జునుడు, దుర్యోధనుడు, శ్రీ కృష్ణ పరమాత్మ చెంతకు పోయినారు. దుర్యోధనుడు ముందుగా బోయినాడు. అర్జునుడు వెనుకపోయినాడు. అప్పుడు శ్రీ కృష్ణ పరమాత్మ నిద్రపోవుచున్నాడు. నిద్రపోవువారిని లేపకూడదను ధర్మమున్నది. అప్పుడు దుర్యోధనుడు శ్రీకృష్ణ పరమాత్మ పాదముల చెంత కూర్చుండుటకు అభిమానము కలవాడై శిరస్సుదగ్గఱ కూర్చుండెను. అర్జునుడు నిరభిమానముతో పాదముల సన్నిధిని కూర్చుండెను. శ్రీ కృష్ణ పరమాత్మ నిద్రనుండిలేచి పాదముల చెంత కూర్చుండియున్న యర్జునుని చూచెను. అర్జునుని క్షేమముల నడిగెను. పిమ్మట వెనుకవైపుకు చూడగా దుర్యోధనుడుండెను. ఆయన క్షేమములకూడ విచారించి మీరువచ్చిన కార్య మేమని యడిగెను. వారిరువురును యుద్ధమునందు తము సహాయమును గోరివచ్చితిమని చెప్పిరి. అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ దుర్యోధనునితో నిట్లనెను. అర్జునుడు మీకంటె చిన్నవాడు. ముందు వానినిచూచి మాట్లాడుట సంభవించినది. నేనిప్పుడొక యేర్పాటు జేయనున్నాను. ఆ యేర్పాటుచేసినపిమ్మట అర్జునుడు ముందుగా కోరుకొనుటకు మీరు యొప్పుకొనవలయును. అని కృష్ణపరమాత్మ చెప్పగా దానికి తిరుగు చెప్పజాలక దుర్యోధనుడు సమ్మతించెను. అంతట శ్రీకృష్ణ పరమాత్మ నేను యుద్ధములుచేసిచేసి విసుగుజెందియున్నాను కనుక యుద్ధము చేయను. యుద్ధముచేయనట్టి నేను ఒక

ప్రక్క, యాదవసైన్యమంతయు నొకప్రక్క, నుండునట్లు నిర్ణయించినాను. ఈ ఇరుపక్షముల దేనినైన అర్జునుడు ముందు కోరుకొనవచ్చునని చెప్పెను! అర్జును డప్పుడు శ్రీకృష్ణపరమాత్మనే తనపక్ష ముండవలయునని కోరుకొనెను. దుర్యోధనుడు యాదవసైన్యమును అర్జునుడు కోరుకొనునేమోనని సందేహముతో నుండెను. అర్జునుడు తన తలపునకు విరుద్ధముగా గోరుటచే దుర్యోధనుడు సంతసముతో యాదవసైన్యమును తాను తీసికొనెను. ఇక్కడ గ్రహింపదగినభాగ మేమన, పాండవులు భగద్విశ్వాసము కలిగినవారు. ఇప్పుడు పాండవులకు ప్రేమశక్తి, ధర్మశక్తి, భగవచ్ఛక్తి, ఈమూడు యుండుటచే విజయమును బొందగలిగిరి. అట్లే చిన్నచిన్న సభలలో నున్నవారు కొలదిమందియైనను, ప్రేమహృదయులు, ధర్మతత్పరులు, భగవద్విశ్వాసయుక్తులుగా నుండినచో, మాకు తప్పక విజయము సమకూరగలదని తలంచుచున్నాము. ఇప్పుడు బొంబాయిలో నున్నవారొకరితో నొకరు పోట్లాడుకొనుచున్నారు. పెద్ద పట్నముగా నుండియు ప్రయోజన మేమి ? మీయూరిలో నెవరినడిగినను గ్రామములోని వారందరి పేరులను జెప్పెదరు. బొంబాయిలో నొకయింటిలో ప్రక్కగదిలోనున్న వారి పేరుగాని సమాచారముగాని వారికి తెలియదు. అనగా పరస్పరప్రేమ లేదని యర్థమగుచున్నది. ఇప్పుడు పట్నములలో నున్నవారిని పల్లెలలో నున్నవారు యనుకరించుచున్నారు. పట్నములలో నున్నవారు బ్రాంది మొదలయినవి త్రాగితే పల్లెలలోని

వారు, కల్లు సారాయి త్రాగుచున్నారు. పట్నములలోని వారు సిగిరెట్లు మొదలయినవి త్రాగితే, పల్లెలలోనివారు బీడీలు, చుట్టలు, మొదలయినవి త్రాగుచున్నారు. ఈవిధముగా పట్నములలోనున్నవారిని పల్లెలలోనివారు పూర్తిగా ననుకరించుచున్నారు. అందుచే పల్లెలలోనున్నవారు క్రమముగా బలహీనులగుచున్నారు.

మేము ఈ యూరిలో నెన్నికులములున్నవని యడిగినాము. పదియేను కులములవఱ కున్నవని చెప్పినారు. కాని యిప్పుడుచూడగా నందరు నొకేకులముగా గాన్పించుచున్నారు. అయితే కొందరివి తెల్లబట్టలు, కొందరివి యెఱ్ఱబట్టలుగా, మాత్రమున్నవి. ఇక్కడ వీరిలోవీరికి కులభేదములుండునని మేము తలంచుచున్నాము. మీరు అన్యకులస్థుల యింటిలో నొకరు చనిపోయిన తాకి తీసిపార వేసెదరా? "అని అచ్చటి సభలోనివారిని వినోబాజీ" యడిగిరి.

ఆయూరిలోని యొక పెద్దమనిషి యిట్లుచెప్పెను!

జవాబు పెద్దమనిషి:- తాకి తీసిపార వేసెదము!!

ప్రశ్న :- బాబా! హరిజనులు చనిపోయిన తీసి పార వేసెదరా?

పెద్దమనిషి:—హరిజనులను తీసిపార వేయము.

బాబా:— అన్ని కులములవారిని తీసివేసెదమని యంటిరికదా? హరిజనులు మనుష్యులుకారా? ఇది మహాపాపము, అట్లు చేయకూడదు. పేదవానియింటిలో పుట్టినట్లే

శ్రీమంతుని గృహమునందుగూడా పిల్లలు జన్మించినారు. ఇందులో నొకరు గొప్ప మరియొకరు తక్కువ యెట్లయ్యె దరు? కొందరు మా తలిదండ్రులు కులములను గల్పించినా రని చెప్పుదురు. తల్లిదండ్రులు కల్పించినను, అది కల్పనే కదా? అందుచే నీ కల్పితములకు మనము దూరులము కావలయును. కొందరు పరమేశ్వరుడే భేదముల కల్పించినా డనెదరు. మీరు తుమ్మచెట్టువేసిన తుమ్మకాయలు కాయు నట్లు చేయుట, నిమ్మచెట్లువేసిన నిమ్మకాయలు కాయునట్లు చేయుట పరమేశ్వరుడు చేయుపని. ఆయన యొకదృష్టితో చూచిన యన్నియు జేయుచున్నాడు. ఒక దృష్టితో జూచిన నేమియు చేయుటలేదు.

మేము చూచిన ఒక గాథ చెప్పెదము. ఒకరియింటిలో వారి తండ్రి చనిపోయినాడు. ఆయనయింటిలో శవమునుబెట్టి తాళము వేసి ప్రక్కయూరికి పోవుచుండెను. ఆయన మాకు కనపడగా నెక్కడికిపోవుచున్నావని యడిగితిమి. మా తండ్రి గారు చనిపోయినారు. ఈ యూరిలో మా కులమువారు లేరు. కనుక యెవరును శవమును దీసివేయుటకు రారు. అందుచే ప్రక్కగ్రామమునకు పోయి మా కులమువారిని పిలుచుకొనివచ్చుటకు పోవుచున్నానని చెప్పెను. ఆహా! ఎంత యాశ్చర్యవిషయము. ఒకమనిషి యొకయూరిలో చని పోయినచో పొరుగుయూరికి పోయి మనుష్యులను దీసికొని రావలయునా? అన్నితనువులకంటె మానవదేహము పవిత్ర ధర్మమాచరించుట కనుకూలమైనది. అట్టి దేహమును

ముట్టుట గొప్ప పాపమనుకొనుచున్నారు. ప్రేమ ప్రధానమైనది. ప్రేమయుండిన కులముల చూడపనిలేదు. శ్రీరామచంద్రమూర్తి, శబరి భక్తితోనిచ్చిన యెంగిలిపండ్లను భక్షించినాడు. భక్తి ప్రపూరిత హృదయుడగు గుహుని కౌగలించుకొనినాడు. ఈ కులభేదములవలన సమస్త శక్తులు నశించుచున్నవి. ఇతర దేశీయులు మన దేశము నాక్రమించుకొనుటకు ఈ కులభేదములే కారణము. చనిపోయిన బ్రాహ్మణుని తగులబెట్టిన బంగారమగుటలేదు. హరిజనుని తగులబెట్టిన బూడిద యగుటలేదు.

పంచపాండవులదగ్గఱ భగవంతుడున్నట్లు మీ చెంతనుండవలయునని నైకవత్యము గలిగియుండవలయును. అందుకే భూదానయజ్ఞమునారంభించినాము. తనయూరిలోనందరి క్షేమములు చూచినపిమ్మట తన క్షేమముల చూచుకొనవలయును. అట్లు చేయుచుండిన పాండవులవలె కాగలము. అప్పుడందరు భుజించినపిమ్మట నేను తినెదను. అని తలచును. ఇప్పుడు భారతదేశమునకు స్వరాజ్యము వచ్చినది. ఎక్కడికివచ్చినది? డిల్లీకి, కర్నూలునకు, వచ్చినది. ఆ వార్తలు యింకా మీకు చేరలేదు. మీ గ్రామములో హరిజనులుందురు. వారితోకలసి వారి సౌఖ్యమునకు కర్మ చేయుడు. హరిజనులలోకూడ గొప్ప భక్తులు జ్ఞానులు కలరు. తమిళదేశములో నందనారు, ఉత్తరదేశములో రవిదాసు, హరిజనభక్తులే. ఫలాని కులమని తేడా పెట్టుకొనవలదు. ఇట్లయిక్యముగానుండిన నొకరి సుఖదుఃఖములలో నొకరు

పాల్గొనుట జరుగును. ఒక హరిజనుడు నీటిలోబడి మునిగి పోవుచుండిన మీరు తీయరాయేమి? అట్లుండకూడదు, ఆ హరిజనుని తీయుడు. మీరంతగా మైలపడినచో ముప్పది సారులు మునుగుడు. మీకు నీరు యెక్కువగా నుండును గనుక!

ఇప్పుడు మేము చెప్పినట్లు చేసిన యైక్యమత్యము మీకు చేకూరగలదు! ఐకమత్యముండిన చోట, ప్రేమయుండిన చోట, ధర్మముండును. అప్పు డందరిజీవితములును పవిత్రము లగును. ఈ గాలి, నీరు, అగ్ని, ఆకాశము అందరి సౌఖ్య మునకై యేర్పడినవి. అట్లే భూమికూడ యందరి సౌఖ్యము నకై భగవంతుడు సృష్టించినాడు. ఈ ధర్మము ప్రపంచములో నుండనంతవఱకు సుఖముండదు. సోదరులారా! కొలది కాలములో కావలసిన విషయమును మీముందు పెట్టినాము. ఇంతటితో విరమించుచున్నాము. అందరికి భక్తిపూర్వక వందనములు.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

57

# (10)

## కర్నూలుజిల్లా

ఆ దో ని 22-3-1956

దైవస్పర్శ హృదయమునకు తగిలిన యెంతో పని జరుగును. ఆయన పవిత్ర గుణములను జింతించవలయును. సత్యము, శాంతము, దయ. ఈ భగవంతుని గుణములను, మౌనపూర్వకముగా, ధ్యానించవలయును.

## ఉపన్యాసారంభము

మా ఈయాత్ర నదివలె ప్రవహించుచున్నది. ఒక ప్పుడు నదీతీరమున చిన్న పల్లెలు, పెద్దపల్లెలు, పట్నములు, వచ్చుచుండును. నది యందరికి సమానముగా సేవజేయును. పల్లెలలోనివారికి తీయని జలము నిచ్చును. పట్నములలోని వారికి కూడ అక్కడి మురికికాలువలు నదిలోనికి విడువక పోయినచో మంచి జలముల నొసగును.

నదీగుణము చల్లదనమునిచ్చుట. ఈ పట్టణమునకు కొంత శాంతియు, మంచియు గలుగవలయునని, మా యుద్దే శ్యము. భారతదేశ వ్యవస్థ వ్యక్తిగత వ్యాపారములో నున్నదని ఎవరును తలచవలదు. సమష్టి భావముతో వ్యాపారము ఈ దేశములో సాగినది. విద్యార్థులు పట్టణము లలో నుండుట కూడదు. ఏకాంత స్థలములలోనుండి అధ్య

యనము చేయవలయును. ఇట్లు విద్య నార్జించినపిమ్మట దేశమునకు సేవ చేయవలయును. విద్యావిధానము పూర్వము నదీతీరములలోను, పర్వతముల సాన్నిధ్యమునను, జరుగుచుండెడిది. రాజకుమారులు సహితము, గృహములను వదలి, గురువుల చెంత ఏకాంత ప్రదేశములలో విద్య నభ్యసించుచుండెడివారు. నేడు రాజధానియు, హైకోర్టును, విద్యాసంస్థలును పట్టణములలోనే పెట్టుచున్నారు. పట్టణములలో విద్యాసంస్థ లుండుటవలన, విద్యలో చాల మిశ్రమము జరుగుచున్నది. అందులో ఆశాజనక విషయ మేమన పల్లెలలోని వారుకూడ యుండెదరు. కూలీలుకూడ యుండెదరు. నిన్న మంచి రుచికర విషయ మొకటి చదివినాము. అది పంజాబునకు సంబంధించిన విషయము. అచ్చట హిందువులున్నారు. కాని వారి సంఖ్య చాలతక్కువ. అచ్చటి హిందువులు పాకిస్థాన్ వారికి చాల యక్కరగానున్నారు. ఏమియక్కరనిన అచ్చటి పట్టణములలోనున్న పాకీ పనులను, ఈ హిందువులే చేయవలయును. అందుచే వారినిచ్చటికి రానిచ్చుటలేదు. ఇప్పుడు వారిని మన దేశమునకు రానిచ్చుచున్నారట. ఇదినాకు సంతోషవిషయముగా నున్నది. ఈ దినము ఈ ఊరి సమీపమున దారిన వచ్చుచుంటిమి. మేము వచ్చు బాట కిరువైపుల మలము నిండియున్నది. ముక్కు మూసికొనవలసి వచ్చినది. ఇచ్చటి పాకీవారికి ఇచ్చటి గ్రామాధిపతులు జీతముల నెక్కువగా నివ్వలేదుకాబోలు! వారు యెక్కువజీతము లడిగియుండవచ్చును. దానిచే వారికి వీరికి తగవులు పడి

యుండవచ్చును. భారత దేశములోనున్న విద్యార్థులు ఈ మూడు నిర్ణయములకు రావలయును. అందుచే కొన్ని మంచి విషయములను వారికి చెప్పవలయును. అందుచే మొట్ట మొదట విద్యార్థులను గురించి చెప్పెదము. ఎందువలన ననిన భారత దేశ కళ్యాణమంతయు విద్యార్థులపై నాధార పడియున్నది. భారతీయుల జీవిత విధానమును మూడు దశ లుగా నిర్ణయించుకొనిరి. అందులో ప్రథమదశను ప్రాతః కాలముతోడను, ద్వితీయ దశను,మధ్యాహ్న కాలముతోడను, తృతీయ దశను సాయంకాలముతోడను, బోల్చవచ్చును. ప్రాతఃకాలము చాల యమూల్యమైనది. ప్రాతఃకాలము దైవచింతన మొనర్చుకొనుటకును, సద్గ్రంథముల పఠించుట కును, విశ్వకళ్యాణదాయకములగు పవిత్ర గ్రంథముల రచిం చుటకును, మిగుల యనుకూలముగానుండును. మన జీవితము నందు ఈ ప్రాతఃకాలముతో సమమైనది విద్యార్థిదశ. కావున విద్యాభ్యాస మత్యంత జాగ్రతగా జేయదగియున్నది. రెండవ దశ గృహస్థాశ్రమము. ఇది మధ్యాహ్న సమయముతో పోల్చదగియున్నది.

మూడవదశను, వానప్రస్థ సంన్యాసాశ్రమములతో పోల్చవచ్చును. ఈ దశను సాయంకాలమునకు సరిపోల్చ వచ్చును. మేము ఉత్తమరచనల నన్నిటిని ప్రాతఃకాలము నందే రచించియుంటిమి. మేమిప్పటికి బ్రహ్మముహూర్త మున లేచి యధ్యయన మొనర్చుచున్నాము. ఇప్పటికిని నూతన భాషలను, నూతన గ్రంథములను చదువుచున్నాము.

ఇటీవల నొక జపాను సోదరుడు (బౌద్ధసంన్యాసి) మా చెంతకు వచ్చిరి. వారికిని మాకును, కొంత ప్రేమసంబంధ మేర్పడెను. వారిదగ్గఱ యిటీవల దినమున కొకగంటసేపు, రెండుమాసములు జపాను భాషను అధ్యయన మొనర్చితిమి. జపాను భాషానిర్మాణము, దక్షిణ భారతీయ భాషల నిర్మాణమును బోలియున్నది. మీ రే క్రమమున మీ భాష నుచ్చరించుచున్నారో, జపాను భాషనుకూడ యదేక్రమములో నుచ్చరించవలయును. మీరు నేర్చుకొనినచో జపాను భాషను ఒక మాసము దినములలో నేర్పగలము. ఈ భాషలో నింత సామ్య మున్నదనిన వేలకొలది సంవత్సరముల నుండియు సముద్రమునందు నౌకాయానములు జరుగుచున్నట్లున్నది. వేదమునందు సముద్రములో నౌకాయానములు జరుగుచున్నట్లు యుపమాన వాక్యము లున్నవి. దీనివలన జపాను దేశమునకును, ఈ దక్షిణ భారత దేశమునకును, పూర్వ మెప్పుడో రాకపోకలు జరుగుచున్నటుల వ్యక్తమగుచున్నది. మేమీ జపాను భాషను నేర్చుకొనుటవలన పై యనుభవము జనించినది. దీనివలన మాకేమియు నష్టము లేదు. మమ్మొల భగవంతుడు తీసుకపోవు దినమునందును, నేదియో కొంచము అధ్యయన మొనర్చియే పోగలమని తలంచుచున్నాము. విద్య నార్జించువారు తప్పక నాలుగు గంటలకు లేచి యధ్యయన మొనర్చవలయును. మీలో నెందరు నాలుగుగంటలకు లేచి యధ్యయన మొనర్చుచున్నారో, చేతులెత్తుడు. (అప్పుడ నేకులు చేతుల

నెత్తిరి.) ఈరోజు మీరు నేర్చెడి విద్య మీ తలలకు చాల భారమును గలుగజేయుచున్నది. ఆ బరువు క్రింద నలిగిపోవుచు అధ్యయన మొనర్పవలయునని కుతూహల పడుచున్నారు. మీరు చదివెడి చదువులు మిక్కిలి యన్యాయమును గలుగజేయుచున్నవి. విద్యార్థులు, యితర పనులను జేయుటకు సంసిద్ధులగుటలేదు. నిర్ణీత గ్రంథములను చదువుట యందే తృప్తిని పొందుచున్నారు. పూర్వకాల మిటులకాదు. విద్యతో పాటు అన్నిపనులు గురుకులమునం దభ్యసించెడివారు. అందుచే వారు జీవితముల నిర్భయముగా గడుపగలిగిరి. నేడు విద్యాభ్యాసము పూర్తియైనపిమ్మట ఉద్యోగము లభింపకపోయినచో చింతాకుల చిత్తులగుచున్నారు. ఇపుడు వైద్య పరీక్షయందు త్తీర్ణులైనవారు, ఇతరుల కష్టసుఖముల విచారించుటలేదు. అందుచే వారు ద్రవ్యార్జనకొఱకు పాటు బడుచు రోగులు తమచెంతకు వచ్చినప్పుడు బాగుగా చూచుటలేదు. వైద్యుని చేతికి చేయినిచ్చిన అరనిమిషమైనను సావధానముగా పరీక్ష చేయడు. మాకు కొంచెము శరీరము నందు వ్యాధియున్నది. అందుకొఱకు డాక్టర్ల చేతికి చేయిని పట్టించుటకు బుద్ధిపుట్టుటలేదు. ఎందుచేత వీరింత తొందరగా బోవుచున్నారనిన వారు పుస్తకములు మాత్రమే చూచుచుందురు. ఇంకేమియు ప్రపంచ బాగోగులు వారికి తెలియవు. ఒకానొక రోగి ఒక వైద్యునిదగ్గఱకు పోయి మూడుదినములు మందు తీసికొని మఱల డాక్టరు దగ్గఱకు రాకపోయునచో అతడు చచ్చినది బ్రతికినది, ఆరోగ్యము

సమకూరినది, లేనిది, ఆ డాక్టరు విచారించనే విచారించడు. పూర్వకాలపు వైద్యు లిటుల చేయువారు కారు. ఒక రోగి తమ చెంతకు వచ్చి మందు తీసికొనిపోయి తిరిగి రానిచో వాని కెట్లున్నదోయని వాని చెంత కరిగి పలుకరించి పరీక్షించి తగిన చికిత్స చేసి సంతృప్తిపఱచెడివారు.

పట్నములలోని విద్యార్థులు ఆరుగంటలకు లేచుచున్నారు. అందుచే వారికి విద్య చక్కగా వచ్చుటలేదు. రాత్రి యెనిమిదిన్నర గంటలకు భోజనముచేసి అధ్యయనము చేయ మొదలిడెదరు. మిక్కుటముగా భుజించుటవలన వెంటనే నిద్రపోయెదరు. అందుచే రాత్రిపూట విద్యార్థులు స్వల్పముగా భుజించవలయును.

అట్లయిన రాత్రికాలము చదువుకొనుటకును, మఱల నాలుగుగంటలకు మేల్కాని చదువుకొనుటను వీలుండును.

మఱియొక విషయము. ఉపాధ్యాయులకు విద్యార్థుల యందు నమ్మకము లేదు. విద్యార్థుల దృష్టిలో యుపాధ్యాయులు యమధర్మరాజుగా గాన్పించుచున్నారు. ఈ పరిస్థితిని పరీక్షాసమయములలో మనము చూడవచ్చును. పరీక్షా సమయములలో విద్యార్థులు దొంగతనముగా పాఠ్యగ్రంథముల పరీక్ష గదిలోనికి తెచ్చి చూచి వ్రాయుదురని గురువులు వేయికండ్లతో దొంగల ననుమానించినట్లుగ పొంచి చూచుచుందురు. విద్యార్థులపై నమ్మకములేని గురువులు విద్యార్థులకు నీతినిగూడ గఱపనిస్థితిలో నున్నారు. వీరేమి గురుశిష్యులో ! ఇవియేమి గురుకుల వాసములో !

మేము మెట్రిక్ పరీక్షకు పోయినప్పుడు మాకీ యనుభవము వచ్చినది. మాచుట్టును ఉపాధ్యాయులు కావలి కాయుచు తిరుగుచుండిరి. అప్పుడు వీరెందుకు తిరుగుచున్నారా యని ఆలోచించితిమి. విద్యార్థులు దొంగతనముగా పుస్తకములు చూచి వ్రాయుదురని వారందులకై తిరుగుచున్నారని గ్రహించి గురుశిష్య లోకమింత యవినీతిగానున్నదేయని చింతించితిమి. ఇప్పుడు మాకు కలలు వచ్చినట్లయిన అప్పటి భయంకర విద్యాదశయే పొడకట్టుచుండును. ఇప్పుడు 18, సంవత్సరముల వయస్సు లేనియెడల మెట్రిక్ పరీక్షకు కూర్చునుటకు వీలులేకున్నది. 18 సం॥ వరకు తెలివిగల విద్యార్థులు చేయవలసిన పని యేమి? ఊరకనే యుండవలయునా! ఇదియంతయు చూడగా గుడ్డివారి రాజ్యమువలె యున్నది.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

# (11)

## కర్నూలుజిల్లా

ఆదోని 24-3-1956

మొట్టమొదట వినోబాజి అందరిని కూర్చుండమని చెప్పగా సరిగా కూర్చుండకపోయినప్పుడు చెప్పినమాటలు.

యుద్ధములో 5 నిముషముల కాలము యాజ్ఞ యివ్వడముతోనే కాలము గడచిపోయినచో ఓడిపోవుటయే సంభవించును. మా దురదృష్టమువలన మీముందర యెత్తుగా కూర్చుండుట సంభవించుచున్నది. మీరు క్రింద కూర్చుండుటకు సందేహించుచున్నట్లున్నది. ఈ స్థలమునందు కూర్చుండుట మీకెంత కష్టముగానుండినచో పట్నములనుండి వీడిపోయిన బాగుండెడిదికదా! ఎన్ని జన్మములలో పాపము చేయుటచేతనో పట్నములలో నివసించవలసి వచ్చుచున్నది.

## ఉపన్యాసారంభము

ఈ రోజులలో అన్ని దేశములకు ఐక్యము సన్నిహితముగా నున్నది. ఎచ్చటి వాతావరణమైనను త్వరగా మనకు వచ్చుచున్నది. విదేశముల వాతావరణమైనను మనకు వెంటనే వచ్చును. మనము మంచి వాతావరణమును సృష్టించుకొనిన దీని మహిమ విదేశములపై పడును. మన దేశములోని పరంపర ననుసరించి మన మాలోచించుకొనవలెను. అమెరికా యనిన రష్యా భయపడుచున్నది. రష్యా

యనిన యమెరికా భయపడుచున్నది. మీరందరు జ్ఞానము కొఱకు వచ్చినారు. కనుక యేకాగ్రచిత్తులుకండు.. మీ మనస్సు అన్య విషయములలో ప్రవేశించినచో మేము చెప్పిన మాటలు మీ హృదయములోనికి ప్రవేశించవు. వక్తయొక్క వక్తృత్వము శ్రోతలమీద యాధారపడి యున్నది. కృష్ణార్జునుల సంవాదము యుద్ధభూమిలో జరిగినది. అర్జునుని చుట్టు గోలగానున్నను ఏకాగ్రచిత్తుడగుటచే కృష్ణ పరమాత్మ చెప్పిన విషయమును గ్రహించగలిగినాడు. ఈ రోజు ప్రపంచములో భయమున్నది. పెద్దపెద్ద దేశములైన రష్యా అమెరికాలు పరస్పర బలములను చేకూర్చుకొనుచున్నవి. పాకీస్థాను అమెరికాతో సంబంధ మేర్పరచుకొనుచున్నది. పాకీస్థాను ఆయుధముల యమెరికా నుండి గైకొనుచున్నది. మీరు, జాగ్రతగా నున్నారా లేదా యని మన ప్రభుత్వము నడుగుచున్నారు. దానికి దానికి సమాధానము చెప్పెడివారు జాగ్రతగనే యున్నామనుచున్నారు. పాకీస్థానువారు అమెరికానుండి మీరు ఆయుధముల నెందుకు గైకొనుచున్నారని యడిగినప్పుడు, మా రక్షణకొఱకు గైకొనుచున్నాము. మాకు భారతీయులతో యుద్ధము చేయవలయునని లేదు, అని పాకీస్థాను జవాబు చెప్పుచున్నది, పాకీస్థానుతో మేము సంప్రదించవలయునను కొనుచున్నాము. ఎందుచేతననిన పొరుగుననున్న దేశము కనుక. పాకీస్థానముతో మాట్లాడుటకు మేము వెళ్ళు విషయములో మనవారు సైన్యబలమును పూర్తిగా తీసివేయనిచో

మేము వారితో మాట్లాడుటకు విశేషముంపెదు. ఈ విషయమును జనులముందట పెట్టుచున్నాననిన నన్ను ఐదు వేల సంవత్సరములనాడుండవలసిన మనిషి యనెదరు. పాకిస్థాను అనిన భయపడి మనము సైన్యమును పెంపొందించుకొనుచున్నప్పుడు, అమెరికా రష్యా దేశములకు ఆయుధములు వద్దని యెట్లు చెప్పగలము.

ఏ దేశము ఆయుధముల పైనాధారపడక, నైతికబలము మీద ఆధారపడునో, ఆ దేశశక్తి యావత్ప్రపంచముమీద పడును. దీనికియుపాయము ప్రజలలో అహింసాశక్తిని పెంపొందించవలయును. భారతదేశమేకార్యము నారంభించినను హింసాభావమును నిర్మూలించుటకు ప్రయత్నించ వలయునని మేమనుకొనుచున్నాము. స్వతంత్రము వచ్చిన పిమ్మట నే బెంగాలులో పూనాలో బళ్ళారిలో పోలీసులనుంచి అచ్చటి అల్లరుల నణచిపెట్టించినారు. మీ యాంతరంగిక సమస్యకొఱకే యింతయుంది పోలీసులను పెడితే విదేశములు మనలను త్వరగా జయించగలవు. దేశములోని అంతర్గత సమస్యలకు సైన్యము కావలసివచ్చినప్పుడు, విదేశములనుండి కాపాడుకొనుటకు సైన్యముతో పనిలేక యెట్లు జరుగును ? ప్రభుత్వము ప్రజలకు ప్రతిబింబము. అన్ని పార్టీలు అన్నిపక్షములు సైన్యమును సృష్టించకూడదు. అని నిశ్చయించుకొనుట లేదు. సాధారణముగా నందరును కలియుట లేదు. ఈరోజు విశ్వశాంతి కావలయునని యందరమును కోరుకొనుచున్నాము. విశ్వశాంతికొఱకు సంపత్తి భూమి దానమిచ్చిన

నారు పూనుకొనినారని యర్థము. అన్ని పార్టీలవారు ఈ పనికి పూనుకొనవలయునని యూశించుచున్నాను. సమస్యలను పరిష్కారము చేసికొనుటకు శాంతిమయ విధానమును మేము యేర్పాటు చేసికొనెదము, యని నిశ్చయించుకొనవలెను. ఈనాడు ప్రభుత్వము పూర్తిగా నహింసమీద యాధారపడలేదు. హింసమీదను ఆధారపడలేదు. అహింసమీదనే పూర్తిగా నాధారపడితే సైన్యాభివృద్ధి చేయుట యుండకూడదు. హింసమీదనే పూర్తిగా నాధారపడుటయు లేదు. చిన్న చిన్న హింసలమీద నమ్మకమున్నది. మాష్టరుకు ఏటంబాంబుమీద యిష్టముండదు కాని పిల్లవానికి విద్య గఱపునప్పుడు బెత్తము తీసుకొనుటలో నమ్మకమున్నది. ఈ చిన్న హింసలుకూడ భయంకరమైనవే. స్వరాజ్యము! అహింస విధానముమీదనే ఆధారపడి రాలేదు. కొంతకొంత హింసకూడ జరిగినది. పోస్టాఫీసులు పగులగొట్టుట తంతి తీగెలు త్రెంపివేయుట, రైళ్ళు నిలుపుట మొదలగు హింసలు కూడ జరిగినవి. నేయి పంచదార పిండి కలిపితే లడ్డు అయినట్లుగా, హింస అహింస పని మూడు కలిపినప్పుడు విజయము చేకూరునను నమ్మకము చాలమందికియున్నది. అనగా చిన్న హింసలలో నమ్మకమున్నది. ఇది చాలా భయంకరమైనది. నమ్రతగా మీకు మేము విన్నవించునదేమనగా, భూదానోద్యమము ద్వారా భూమి పంచుటయే ప్రధానము కాదు గాని, అహింసావిధానమువలన మహోన్నత కార్యము జరుగగలదని నిరూపించుటకే ఈ కార్యము నారంభించి

న్నాము. హింసమీద మనకు నమ్మకముండినచో మన దేశము పసిబిడ్డవంటిదే యగును. అందుచే యమెరికా రష్యాల నాశ్రయించుదు.

పాకీస్థాను మంత్రి మేము ఆకలితో చచ్చుటకైన సంసిద్ధులముగా నుండెదము కాని, మా దేశమును రక్షించుకొనుటకు సైన్యాభివృద్ధి ప్రయత్నమును మానమనుచున్నాడు. ఇవి మాటలు. పాకీస్థాను మంత్రి ఆకలితో చచ్చుట యెప్పుడైన జరుగునా ? ఆకలితో చచ్చెడిది అచ్చటి పేదప్రజలు. నూటికి డెబ్బదిపాళ్ళు పాకీస్థానములో ఆకలితో పేదవారు కష్టపడి చచ్చుచున్నారు. ఆకలిగొనినను తినుటకు అన్నము దొరుకుటలేదు. వారికి హిందువులమీద ద్వేషమను అన్నమును వారి ప్రభుత్వము తినుపించుచున్నది. అందుచేత మన దేశము సైన్యముమీద యాధారపడితే పసిబిడ్డ యగును. మనలోని పేదవారిని అణచిపెట్టి బాధ పెట్టవలసివచ్చును. నేను చెప్పినట్లుగా నితర దేశములకు లోబడవలయును. అందుచే భూదానయజ్ఞములోని విశిష్టతను ప్రజలు గ్రహించిన శాంతి యేర్పడకలదు. కేవలము సైన్యమువలన లోకము రక్షింపబడదు. ప్రజల యైక్యమువలన గొప్ప శక్తి యుత్పన్నమగును. మనకు ముఖ్యాధారము సైన్యముకాదు. ఐక్యత కావలయును. ఇక్కడ మనకిప్పుడు విద్య లేకపోవుటచే ప్రభుత్వంమీద నాధారపడవలసి వచ్చుచున్నది. మొత్తము శక్తి ప్రభుత్వముచేతికి పోయినచో జనులు జడులయిపోయెదరు. అందుచే మేము ప్రజల విద్యావిధానము ప్రజల చేతు

లలో నుండవలయునని చెప్పినాము. మేము చేసిన సూచన యేమనిన, ప్రభుత్వోద్యోగులకు కాలేజి హైస్కూళ్ళ నాశ్రయించవలసిన యవసరములేదు. అందుచేత విద్యా స్వాతంత్ర్య ముండవలెను. రెండవ దోషము ప్రభుత్వ సంబంధము లేని విద్యా సంస్థలు ప్రభుత్వముమీద ఆధారపడకుండ యుండవలెను. ఈరోజునున్న యెన్నికల పద్ధతి పోవలయును. దీనిలో ప్రమాదమున్నది. కులతత్వము పెరుగుచున్నది.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

—: సమాప్తము :—

## మనవి

సీ॥ పరదేశవాసులు పాలించు మనభూమి
మహనీయుడా గాంధి మనదిసేసె
మనమిప్పుడీధరన్ మైత్రితో సమముగా
ననుభవించెడి పుణ్యమబ్బకుండ
మనలోనె కొందరు మమకారమునుబూని
స్వార్థంబులనుబెంచి సమతవీడి
కూడగుడ్డలు కొంపతోడి సోదరులకు
పంచిపెట్టక వ్యధావనధిముంచ

తే॥ గాంధిశిష్యుండు పూజ్యుండు ఘనతపస్వి
శ్రీవినోబాజి ప్రేమతో జెండిభేద
మిపుడు సామ్యత నెలకొల్ప నెంచినాడు
సభ్యవరులార! వారికి సాయపడుడు.

# తప్పు ఒప్పుల పట్టిక

| పేజి. | పం_క్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 1 | భారదేశ | భారతదేశ |
| 16 | 19 | వచెడిది | వచ్చెడిది |
| 17 | 19 | యీా | యీా |
| 26 | 17 | వరమాత్మ | పరమాత్మ |
| 27 | 1 | గ్రామములు | గ్రామములలోని |
| 29 | 3 | కొనవయునని | కొనవలయునని |
| 29 | 18 | ధాన్యమూ | ధ్యానము |
| 30 | 14 | నా భారత. | భారత |
| 31 | 21 | సన్యాసాశ్రమము | సన్యాసాశ్రమమును లేదు |
| 32 | 23 | మంచివిషయమును | మంచి విషయములు |
| 33 | 20 | అంత | అంతయు |
| 35 | 17 | సంపధానము | సంపద్దానము |
| 36 | 1 | కూలీలతో | కూలితో |
| 36 | 8 | యున్నధి | యున్నవి |
| 36 | 12 | మా | మీా |
| 38 | 12 | నరధము | నర్థము |
| 40 | 10 | మనసున జాగ్రతగా | మనస్సునజాగ్రతగా |
| 42 | 5 | చదివించిన | రచియించిన |
| 44 | 9 | ఆనుకూలము | అనుకూలము |
| 44 | 21 | యంత్రమునతో | యంత్రములతో |
| 45 | 21 | అధారపడి | ఆధారపడి |
| 46 | 11 | గ్రంధముల | గ్రంథముల |
| 47 | 7 | నునది దేమిటి? | నునదేమిటి? |
| 47 | 19 | పద్దారధము | పదార్థము |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 47 | 21 | (ఇచట మూడు పంక్తులంతప్పు.)<br>ఈ శరీరములో నొకరికి<br>యూపిరితిత్తులు లేకపో<br>యినచో యూపిరితిత్తులు<br>తీసికొనిన ఆయన కండ్లను<br>యిచ్చుట ఇల్లే సహాయము<br>చేసికొనిన బాగుండును. | (మార్పు చేసికొనవలసినది.)<br>ఈ శరీరములో నొకరికి<br>యూపిరితిత్తులు లేకపోయి<br>నచో నొక కండ్లులేనివాని<br>యూపిరితిత్తుల తీసికొని,<br>యూపిరితిత్తుల తీసికొనినవా<br>ని కండ్లను కండ్లులేనివాడు<br>తీసికొనిన బాగుండును. |
| 48 | 16 | ముడివస్తువులుంగా | ముడివస్తువుల నవసరవస్తువు<br>లుంగా |



నవయుగం పవర్ ప్రెస్, నెల్లూరు.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B169 |
| పుస్తకం పేరు | వినోబా ప్రవచనములు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |